# 12వ అ ధ్యా య ము

## పుణ్యక్షేత్రములలో మాఘస్నానము

ఈ విధంగా ననేక పుణ్యపురుషుల వృత్తాంతములను మాఘ మాసస్నానఫల మహిమను దిలీప మహారాజునకు వశిష్ఠులవారు వివరించగా-'మహర్షీ! మీ కృపవలన అనేక వృత్తాంతములను తెలుసుకొని కృతార్థుడనై తిని. కాని మరొక సంశయము నాకుగలదు. అది ఏమనగా మాఘమాసమందు ఏయే తీర్థములు దర్శింపవలెనో సెలవిండనీ వినమ్రుడై కోరగా వశిష్ఠులవారు మరల యిట్లనెను.

దిలీప మహారాజా! మాఘస్నానములు చేయుటయందు ఆసక్తి గలవారలకు ముఖ్యమగు తీర్థమహిమల గురించి వివరించెను. శ్రద్ధగా ఆలకింపుము.

మాఘమాసములో నదీస్నానం ముఖ్యమైనది. మాఘస్నానములు చేయక తీర్థములు సేవించిన చాలునని అనుకొనుట అవివేకం. ఎందుకు అనగా మాఘమాసములో ఏ నదిలోని నీరైనను గంగ నీటితో సమానము. అందుచేత మాఘమాసములో నదీస్నానము సర్వపాపహరమైనది. అవస్యకమైనది కూడాను.

అటులనే ప్రయాగ అతి ముఖ్యమైన క్షేత్రం. ఈ భరతఖండములో అతి ప్రధానమైన గంగానది సముద్రములో కలియుచోట మాఘస్నానమాచరించిన ఏడుజన్మలలోని పాపములు సహితము హరించును. మాఘమాసములో నదీస్నానములతో బాటు విష్ణు దేవాలయములు, మహేశ్వరాలయములు మొదలగు మూడువందల అరవై పుణ్యక్షేత్రములు దర్శించిన యెడల గొప్ప ఫలం కల్గుటయే గాక మరల జన్మ అనేది కలుగదు.

ఇక త్రయంబకమను నొక ముఖ్యమైన క్షేత్రం కలదు. అది పడమటి కనుమల దగ్గరున్నది. అచటనే పవిత్రగోదావరీనది జన్మించినది. గౌతముడు తన గోహత్యాదోషమును పోగొట్టుకొనుటకు

ఈశ్వరుని గురించి ఘోరతపస్సు చేసి, గోదావరిని గోహత్య జరిగిన ప్రాంతమునకు ప్రవహింపచేసినాడు. అదియునుగాక మాఘమాసంలో గోదావరియందు స్నానముచేసినయెడల సకలపాపములు తత్క్షణము హరించిపోవుటయేగాక ఇహమందు పరమందు సుఖపడుదురు. గౌతమీ నదిలో మరికొన్ని ప్రసిద్ధములగు ఉపనదులు కూడా కలిసి తమతమ స్నేహ సౌభ్రాతృత్వమును చాటుచున్నవి. అటులనే 'పరంతప' అను ఉపనది ప్రవహించే చోటకూడ శివుడు లింగాకారముగా వెలసి ఉన్నాడు. దానికి ఆవలగా ప్రభావము అను క్షేత్రము గలదు. ఆ క్షేత్రము బ్రహ్మహత్యా మహాపాపములను సహితము పోగొట్టగలదు. ఇందు కొక ఇతివృత్తము గలదు. సావధానుడవై ఆలకింపుము.

విష్ణుమూర్తి నాభికమలమున బుట్టిన బ్రహ్మకు, ఈశ్వరునికి అయిదేసి తలలు ఉండేవి. ఈశ్వరునికి పంచవక్త్రుడు, త్రినేత్రుడు అనే పేరుకూడా కలదుకదా! బ్రహ్మదేవుడు నాకు 'ఐదు తలలున్నవి నేనే గొప్పవాడనని అనగా నాకు ఐదు తలలున్నవి. నేనే గొప్పవాడనని శివుడు వాదించాడు. ఇద్దరూ గర్వముతో వ్యవహరించినందున చిలికి చిలికి గాలివానవలె వారిద్దరిమధ్య కలహము పెద్దదయ్యెను. కడకు ఇద్దరూ యుద్ధముచేయగా శివుడు బ్రహ్మయొక్క ఐదవ తలను నరికి వేసెను. వెంటనే శివునకు బ్రహ్మహత్యాపాతకము చుట్టుకొన్నది.

శివుడు భయపడి నరికిన బ్రహ్మతలను చేతితో పట్టుకొని ముల్లోకాలు తిరుగుచుండగా క్రమముగా చేతిలో ఉన్న బ్రహ్మతల ఎండి పోయి పుఱ్ఱిగా అయినది. ఈశ్వరుడు ఆపుఱ్ఱెతోనే భిక్షమడుగుచూ భూలోకానికి వచ్చాడు. ఈశ్వరుడు సహజంగా అందమైనవాడు. అతడు భిక్షాటనకు వచ్చి 'భిక్షాందేహీ' యని అనగా గృహిణులు భిక్ష పట్టుకుని గుమ్మముకడకు రాగా శివుని మోహనాకారమును చూచి మోహితులై భిక్షవేసి శివునివెంట పోవుచుండిరి. ఈ విచిత్ర

మును మునీశ్వరులు చూచి, కోపం కలవారై తమ భార్యలు శివుని వెంటపోవుట సహించ లేక, ఈతనికి పురుషత్వము నశించుగాక "అని శపించెను.

ఈశ్వరుడు చేయునదిలేక జారి క్రిందపడిపోయిన ఆ లింగము నందే ఐక్యమైపోయినాడు.

అటుల లింగాకారముగా మారినందువలన ఎనలేని తేజస్సుతో ఆ లింగము ప్రకాశించుచుండెను. కోటిసూర్యుల తేజస్సుకలిగి ప్రళయము సంభవించునా ? యన్నట్లు భయంకరముగా నుండెను. అప్పుడు బ్రహ్మ, విష్ణువు, శివునివద్దకువచ్చి వాని నోదార్చి ప్రయాగ క్షేత్రమునకు వెళ్ళి అచ్చట శివునికన్న బ్రహ్మహత్యాది పాపములు పోగొట్టిరి. ఆ విధముగా భూలోకమునకు వచ్చిన శివుడు అప్పటినుండి లింగాకారముగా మారినందున భక్తులు ఆ లింగమునే పూజించుచు శివసాన్నిధ్యమును పొందగలుగుచున్నారు.

# 13వ అధ్యాయము

## శివుడు పార్వతికి మాఘమాస మాహాత్మ్యమును వివరించుట

వశిష్ఠులవారు మార్కండేయుని వృత్తాంతమును శివలింగాకార వృత్తాంతమును వివరించిన తరువాత, ఇంకనూ వినవలెనని కుతూహలుడై దిలీపుడు మరల యిట్లు ప్రశ్నించెను.

"మహాముని ! ఈమాఘమాస మాహాత్మ్యమును ఇంకను వినవలయునెడికోరిక ఉదయించుచున్నది. గాన సెలవిండ"ని ప్రార్థించగా వశిష్ఠుడు యిట్లు చెప్పసాగెను.

మున్ను పార్వతీదేవికి శివుడును, నారదునకు బ్రహ్మ, మాఘమాస మహాత్మ్యము గురించి చెప్పియున్నారు. గాన శివుడు పార్వతికి చెప్పిన విధముచు వివరించెదను వినుము.

ఒకనాడు పరమశివుడు గణాధి సేవితంబును, నానారత్న విభూషితంబునగు కైలాస పర్వతమునందలి మందారవృక్ష సమీప

మున ఏకాంతంగా కూర్చునివున్న సమయమున జగజ్జనని యగు పార్వతీ దేవి వచ్చి, భర్త పాదములకు నమస్కరించి,- "స్వామీ! మీవలన ననేక పుణ్యసంగతులు తెలిసికొంటిని. కాని ప్రయాగ క్షేత్ర మహాత్మ్యమును మాఘమాస మహాత్మ్యమును వినవలె ననెడి కోరిక వున్నది. గాన ఈ ఏకాంత సమయమందు దాక్షేత్ర మహిమలను వివరింప ప్రార్థించుచున్న దాన! నని వేడుకొనగా పార్వతీ పతియగు శంకరుడు మందహాసముతో ఇట్లు వివరించెను.

దేవీ! నీ యభీష్టము తప్పక తీర్చెదను శ్రద్ధగా వినుము.

సూర్యుడు మకర రాశియందు వుండగా మాఘమాసమందు ప్రాతః కాలమున ఏ మనుజుడు నదిలో స్నానము చేయునో, అతడు సకల పాపములనుండి విముక్తు డగుటయేగాక, జన్మాంతమందు మోక్షమును పొందును. అటులనే మాఘమాసంలో సూర్యుడు మకర రాశియందు ఉండగా, ప్రయాగ క్షేత్రమందే నరుడు స్నానమాచరించునో అతనికి వైకుంఠ ప్రాప్తి కలుగును. అంతియేగాదు, జీవనది వున్నను లేకున్నను కడకు పాదం మునుగునంత నీరు వున్న చోటగాని తటాక మందుగాని, మాఘమాసంలో ప్రాతఃకాల స్నానము గొప్ప ఫలము నిచ్చుటయేగాక సమస్త పాపములు విచ్చిపోవును. రెండవరోజు స్నానము జేసిన విష్ణులోకమునకు పోవును. మూడవనాటి స్నానము వలన విష్ణుదర్శనం కలుగును. మాఘమాసమునందు ప్రయాగ క్షేత్ర మందుగల గంగానదిలో స్నానమాచరించిన యెడల ఆ మనుజునకు మరుజన్మ అనునది వుండదు.

దేవీ మాఘమాస స్నానఫలము ఇంతయని చెప్పజాలను. మాఘమాసమునందు భాస్కరుడు మకర రాశియందు వుండగా ఏదిఅందు బాటులోవున్న అనగా- నదిగాని, చెరువుగాని, నుయ్యిగాని, కాలువ గాని లేదా పాదము మునుగునంత నీరున్న చోటగాని ప్రాతఃకాలమున స్నానమాచరించి, సూర్యభగవానునకు నమస్కరించి తనకు తోచిన దానధర్మములు చేసి, శివాలయమునగాని విష్ణ్వాలయమునగాని దీపము

వెలిగించి భక్తి శ్రద్ధలతో అర్చనచేసిన మానవులకు వచ్చు పుణ్యఫలం అంతింతగాదు.

ఏ మానవునకైననూ తన శరీరంలో శక్తిలేక, నడువలేనటు వంటివాడు. గోవు పాదం మునుగునంత నీరున్న సెలయేటి యందైననూ కడకు బావియందైననూ స్నానమాచరించి శ్రీహరి దర్శనము చేసినచో అతి డెట్టి కష్టములు అనుభవించుచున్ననూ, వాని కష్టములు మేఘమువలె విడిపోయి విముక్తుడగును. ఎవరైననూ తెలిసిగాని, తెలియకగాని, మాఘమాసంలో సూర్యుడు మకర రాశి యందుండగా నదీస్నాన మాచరించిన యెడల అతనికి అశ్వమేధయాగం చేసినంత ఫలము దక్కును. అదియునుగాక మాఘమాసమంతట ప్రాతఃకాలమున నదిలో స్నానంచేసి శ్రీమన్నారాయణుని పూజించి సాయంకాల సమయమున మాఘపురాణం చదివి, విష్ణుమందిరమునగాని, శివాలయమునగాని దీపం వెలిగించి ప్రసాదం సేవించినయెడల అతనికి తప్పక విష్ణులోక ప్రాప్తి గలుగుటయేగాక, పునర్జన్మ ఎన్నటికినీ కలుగదు. ఇటుల ఒక్క పురుషుడేగాక స్త్రీలు కూడా ఆచరించ వచ్చును. మానవుడు నరజన్మ మెత్తిన తరువాత మరల ఘోరపాపములుచేసి మరణానంతరము రౌరవాది నరక బాధలు అనుభవించుటకంటె తాను బ్రతికి ఉన్నంత కాలము మాఘమాసమందు నదీస్నానము చేసి దాన పుణ్యములు ఆచరించి, వైకుంఠ ప్రాప్తినొందుట శ్రేయస్కరంగదా! ఇదే మానవుడు మోక్షము పొందుటకు దగ్గరమార్గం గాన ఓ పార్వతీ ఇంకనూ వినుము ఏమానవుడు మాఘమాసమును తృణీకరించునో అట్టివాడు ఎటువంటి బాధ లనుభవించునో వివరించెదను సావధానురాలవై ఆలకింపుము.

నేను తెలియ జేసిన విధంగా ఏ మనుజుడు మాఘమాసమందు ప్రాతఃకాలమున జపంగాని. విష్ణుపూజగాని యథాశక్తి దానపుణ్యములు చేయడో అట్టివాడు మరణానంతరము సమస్త నరక బాధలు అనుభవించును. కుంభీపాకనరకంలో పడద్రోయబడును.

అగ్నిలో కాల్చబడును. రంపముల చేత, ఖడ్గముల చేత, నరుకబడును. సలసల క్రాగు తైలములో పడ వేయబడును. భయంకర యమకింకరుల చే పీడింపబడును.

ఏ స్త్రీ వేకువజామున నే లేచి కాలకృత్యములు తీర్చుకుని నదికి పోయి స్నానము చేసి సూర్యనమస్కారము విష్ణుపూజ చేసి తన భర్త పాదములకు నమస్కరించి, అత్తమామల సేవలు చేయునో, అట్టి ఉత్తమ స్త్రీకి ఐదవతనము వర్ధిల్లి, ఇహమందు పరమందు సర్వ సౌఖ్యములు అనుభవించును. ఇది ముమ్మాటికి నిజము. మాఘమాసమందు ఏ స్త్రీ అటుల చేయదో. అట్టి స్త్రీ ముఖం చూచిన సకల దోషములు కలుగు టయే గాక, ఆమె పంది, కుక్క జన్మమెత్తి హీనస్థితి నొందును.

మాఘమాస స్నానమునకు వయోపరిమితి లేదు. బాలుడైనను, యువకుడై నన్ను, వృద్ధుడైనను, స్త్రీ యైనను, బాలికైనను జవ్వని యైనను మాఘస్నాన మాచరించవచ్చును. ఈ మాసమంతయు కడు నిష్టతో వుండిన కోటి యజ్ఞములు చేసినంత పుణ్యం కలుగును. ఇది అందరికిని శ్రేయోదాయకమైనది.

పార్వతీ! దుష్టులలో స్నానంచేసినవారు, బ్రహ్మహత్యాదిమహా పాపములు చేసినవారు, సువర్ణము దొంగిలించినవారు, గురుభార్యతో సంభోగించువారు, మధ్యము త్రాగి పరస్త్రీలతో క్రీడించువారు, జీవ హింసలు చేయువారు మాఘమాసంలో నదీస్నానంచేసి విష్ణువును పూజించిన యెడల అట్టి వారి సమస్త పాపములు నశించుటయే గాక జన్మాంతరమున వైకుంఠ ప్రాప్తి కలుగును. మరియు కులభ్రష్టు లైన వాడును, కించిత్ మాత్రమైననూ దానధర్మములు చేయని వాడునూ, ఇతరులను వంచించి, వారివద్ద ధన మపహరించిన వాడును, అసత్యమాడి ప్రొద్దు గడుపువాడును, మిత్ర ద్రోహియు, హత్యలు చేయువాడును, బ్రాహ్మణులను హింసించువాడును, సదా వ్యభిచార

గృహములో తిరిగి తాళిగట్టిన ఇల్లాలిని కన్న బిడ్డలను వేధించువాడును, రాజద్రోహి, గురుద్రోహియు, దైవభక్తి లేనివాడును దైవభక్తులను ఎగతాళి చేయువాడును, గర్వము కలవాడై తాను గొప్పవాడనను అహంభావముతో దైవకార్యములను, ధర్మకార్యములను చెడగొట్టుచు దంపతులకు విభేదములు కల్పించి, సంసారములు విడదీయువాడును; ఇండ్లను తగుల బెట్టువాడును; చెడుపనులకు ప్రేరేపించువాడును; ఈవిధమైన పాపకర్మలు చేయువారులు ఎట్టి ప్రాయశ్చిత్తములు జరుపకనే; మాఘమాసమందు మాఘమాస స్నానము చేసిన యెడలవారందరు పవిత్రులగుదురు.

"దేవీ! ఇంకను దాని మాహాత్మ్యమును వివరించెదను వినుము. తెలిసియుండియు పాపములు చేయువాడును; క్రూరకర్మములు ఆచరించువాడును; సిగ్గువిడిచి తిరుగువాడును. బ్రాహ్మణదూషకుడు మొదలగు వారు మాఘమాసములో ఉదయమే నదికి వెళ్ళి స్నానము చేసిన యెడల వారికున్న పాపములన్నీ నాశనమగును. మాఘమాస స్నానములు ప్రాతఃకాలముననే చేయవలెను. ఆలాగున చేసినచో సత్ఫలితము కలుగును. ఏ మానవుడు భక్తిశ్రద్ధలతో మాఘమాసము మొదటి నుండీ ఆఖరు పర్యంతమూ స్నానములు చేసెదనని సంకల్పించునో అటువంటి మానవులకున్న పాపములు తొలిగిపోయి, ఎటువంటి దోషములూ లేక పరిశుద్ధుడగును. అతడు పరమపదము జేర అర్హుడగును.

శాంభవీ! పండ్రెండు మాసములలో మాఘమాసం మిక్కిలి ప్రశస్తమైనది. సకల దేవతలలో శ్రీమన్నారాయణుడు ముఖ్యుడు. అన్ని శాస్త్రములలో వేదము ప్రధానమైనది. అన్ని జాతులలో బ్రాహ్మణుడధికుడు. అన్ని పర్వతాలలో మేరుపర్వతం గొప్పది. అటులనే అన్ని మాసములలో మాఘమాసము శ్రేష్ఠమైనదగుటచే ఆ మాసమందాచరించే ఏస్వల్ప కార్యమైననూ గొప్ప ఫలితాన్ని కలుగ

జేయును. చలిగానున్నదని స్నానము చేయని మనుష్యుడు తనకు లభించ బోవు పుణ్యఫలం కాలితో తన్నుకున్నట్లయగును. వృద్ధులు, జబ్బుగా నున్నవారు, చలిలో చన్నీళ్ళలో స్నానము చేయలేరు. కాన అట్టివారికి ఎండుకట్టెలు తెచ్చి, అగ్ని రాజవేసి వారిని చలికాగనిచ్చిన తరువాత స్నానము చేయించినయెడల ఆ స్నానఫలము పొందగలరు. అదియును గాక చలికాగినవారు స్నానము చేసి శ్రీహరిని దర్శించిన పిదప అగ్ని దేవునికి సూర్యభగవానునికి నమస్కరించి నైవేద్యము పెట్టవలెను. మాఘమాసములో శుచియై ఒక బీదబ్రాహ్మణునికి వస్త్రదానము చేసిన యెడల మంచి ఫలితం కలుగును.

ఈ విధంగా ఆచరించినవానిని జూచి ఏ మనుజుడైననూ అప హాస్యముగా జూచినను, లేక అడ్డుతగిలిననూ, మహాపాపములు సంప్రా ప్తించును. మాఘమాసము ప్రారంభము కాగానే వృద్ధులగు తండ్రిని, తల్లిని, తన భార్యను, లేక కుటుంబసభ్యులందరినీ మాఘస్నానమాచ రించునటుల ఏ మానవుడు చేయునో, అతనికి మాఘమాస ఫలితము తప్పక కల్గును. ఆ విధముగానే బ్రాహ్మణునిగాని, వైశ్యునిగాని, క్షత్రి యునిగాని, శూద్రునిగాని, మాఘమాసస్నానం చేయమని చెప్పిన యెడల, వాడు పుణ్యలోకము బోవుటకు ఏ అడ్డంకులు వుండవు. మాఘ మాసస్నానములు చేసినవారికిగాని లేక వారిని ప్రోత్సహించువారలను జూచిగాని ఆక్షేపించి, పరిహాసం లాడువారికి ఘోర నరక బాధలు కలుగుటయే కాక ఆయుక్షీణము వంశక్షీణము కలిగి దరిద్రుడగును.

నడచుటకు ఓపిక లేనివారలు మాఘమాసములో కాళ్ళుచేతులు ముఖము కడుగుకొని, తలపై నీళ్ళు జల్లుకొని సూర్యనమస్కారమును జేసి మాఘపురాణమును చదివిగాని, వినుటగాని, చేసినయెడల జన్మాంత మున విష్ణుసాన్నిధ్యము పొందును. పాపములు దరిద్రము నశిరిపవలయు నన్న మాఘస్నానముకన్న మరొకపుణ్యకార్య మేదియును లేదు. మాఘస్నానమునలన [illegible] అశ్వమేధ

యాగములు చేసి బ్రాహ్మణులకు దక్షిణలిచ్చిన నెంతటి పుణ్యఫలము కలుగునో మాఘమాసస్నానము అంతటి పుణ్యఫలము కలుగును. బ్రాహ్మణహత్య, పితృహత్యా మహాపాతకములు చేసిన మనుజుడైనను, మాఘమాసము అంతయు కడు నిష్ఠతో వున్నయెడల రౌరవాది నరకములనుండి విముక్తుడగును.

గనుక ఓ పార్వతీ! మాఘమాసస్నానమువలన నెట్టి ఫలితము కలుగునో వివరించితినిగాన నే చెప్పిన రీతి ఆచరింపుము.

# 14వ అధ్యాయము

## బ్రాహ్మణస్త్రీ భర్తతో స్వర్గమునకు వెళ్ళుట

ఓ దిలీపుడా! మాఘమాసములో స్నానమాచరించుట వలన కలుగు ఫలమును పార్వతికి ఈశ్వరుడు చెప్పినది వింటివికదా! అటులనే విప్రకన్య తనభర్తతో ఎటుల విష్ణుసాయుజ్యమును పొందెనో వివరింతును సావధానుడవై ఆలకింపుము.

పూర్వకాలమందు కాశ్మీర దేశమందుగల ఒక గ్రామములో సుబుద్ధి యను బ్రాహ్మణుడు కలడు, అతడు నాలుగువేదములు చదివి అర్థ తాత్పర్యసహితముగా వర్ణించగల పండితుడు. చదువు నందెటుల పాండిత్యముగలదో బుద్ధియందును పేరుకుతగినటులే పెద్దలను గౌరవించుట, భూతదయగలిగి, అందరి మన్ననలను పొందియుండెను. అతడు గొప్ప పండితుడగుటవల్ల అనేకమంది ఇతర పండితులు అతని వద్దకు జేరి శిష్యులైరి. ఆ బ్రాహ్మణునకు పది సంవత్సరముల బాలికామణి కలదు. ఆమె పేరు సుశీల. ఆ బాలిక కడు రూపవతి. సుగుణాల రాశి, అందాలబరిణె లేడికన్నులవలె చక్కటి నయనాలు గలది. నిండుచంద్రునివంటి ముఖముగలది. తుమ్మెద రెక్కలను పోలు నల్లని పొడుగాటి తలవెంట్రుకలు గలది. ఆమె నడచినయెడల హంస నడకను మరిపించు నడక గలది. అందమైన ముఖవర్చస్సు గలది. కోకిల కంఠమువంటి మధురమైన కంఠము కలది. ఆ సుందరాంగి ముక్కు, పండ్లవరుస చూచినవారికి మరల మరల చూడ

వలయుననను కోరిక పుట్టును. అటువంటి సర్వ గుణములు గల తన కుమార్తెను ఎవరికిచ్చి పెండ్లి చేతునా యని తండ్రి సుబుద్ధిని ఆలోచించుచుండెను.

ఒకనాడు సుమిత్రుడను శిష్యుడొకడు గురువుగారి ఇంటజరుగు దైవ కార్యమునకు పూజాద్రవ్యములను తెచ్చుటకై అడవికి బయలు దేరి వెళ్ళుచుండగా-దారిలోనున్న ఉద్యానవనములో సుశీల తనస్నేహితురాండ్రతో బంతులాట ఆడుకొనుచుండెను. ఆ బంతి బైటకు పడినందున బంతి తెచ్చుటకు తోట వెలుపలకు సుశీలవచ్చి సుమిత్రుని చూచినది.

సుమిత్రుడుకూడ యుక్తవయస్సులో నున్నాడు. చక్కటి ఆవయవసౌష్టవం కలవాడు. విశాలమైన వక్షముకలిగి, బంగారు కాంతిగల రూపవంతుడు. అతని అందమును సుశీల చూడగానే నివ్వెరపోయినది. అతనిని తదేకదృష్టితో చూచి అతని వెంటబడినది. సుమిత్రుడు తన కార్యము కొలది చాలదూర మేగెను. అలా కొంతదూర మేగుసరికి ఒక కోనేరు కనుపించెను. ఆ కోనేరునిండా తామారపువ్వులు విరబూసి ఉన్నాయి. తుమ్మెదలు గుంపులుగా ఎగిరి తామరపువ్వులలోని మధువును గ్రోలుచు మత్తెక్కి ఎగురుచున్నవి. అచ్చటనున్న వివిధ ఫల వృక్షాలు పువ్వులతోను, పండ్లతోను నిండివున్నాయి. కోయిలలు తమ మధుర కంఠాలను విప్పి కూయుచున్నవి. మగనెమళ్ళు ఆడ నెమళ్ళకు తమ అందాన్ని చూపించుటకు కాబోలు తమతమ పింఛములను విప్పి నాట్యమాడుచున్నవి. నీటి జంతువులు తామరతూండ్లను తింటూ, ఒక్కొక్కప్పుడు పైకెగిరిపడుతూ నీటిలో ఈదుచున్నవి. సుమిత్రుడు దూరంనుంచి అలసిపోయి వచ్చినందువలన ఆ చల్లని నీరు గ్రోలి చెట్లనీడను విశ్రమించి యుండెను. వెనుకనుండి వచ్చిన సుశీల అచటి ప్రకృతి రమణీయతను చూచి మల్లె, జాజి, సంపెంగ పూవుల వాసనలకు మన్మథచేష్టలతో మత్తెక్కినదై చెట్లక్రింద విశ్రమించి యున్న సుమిత్రుని సమీపమునకు మెల్లగా వచ్చి నిలబడినది. సుమిత్రుని సౌందర్యమును కనులారా చూచి చలించిపోయినది. ఇక తానే

సుమిత్రుని పలకరించినది. "ఓ అందగాడా! సుమిత్రా! నిన్ను చూచినది మొదలు నా మనస్సు నా స్వాధీనములో లేదు. అందులకే నీ వెనుక ఇంతదూరము వచ్చితిని ఈ ఏకాంతప్రదేశమున నన్ను కౌగిలించుకొని నాతో కూడుము. నీవయసు, నావయసు సరిసమానము. ఇద్దరమూ ఏరికూర్చిన జంటవలె నున్నాము చిలకా గోరింకలవలెను, రతీమన్మథులవలెను లీనమైపోవుదము. ఆ చెట్టుపైనున్న గువ్వలజంటలను చూడు. మధువున్మత్తాగి మత్తెక్కిన ఆ తుమ్మెదల జంటల చూడు ఏలాగున్నవో! కాన రమ్ము నాయవ్వనబింకాన్ని ఆఘ్రాణించుము. సమయమును జారవిడువకుము. నా సుకుమార లేత శరీరాన్ని సున్నితములగు అవయవములను నీ కర్పింతును. నీవు మన్మథునివలె వచ్చి నన్ను కౌగలించుకో" అని అనేక విధాల ఆ విప్రకుమారుని తొందర పెట్టసాగెను.

అంత సుమిత్రుడు నిశ్చేష్టుడై నోటమాటరాక శిలావిగ్రహము వలెను, కొంతసేపైన తరువాత బాలా! నీ మాటలు చూడ పిచ్చి దానివలె నున్నావు. నీకేదైనా గ్రహము ఆవరించినదా ? అని సందేహము కల్గుచున్నది. అదియుగాక నీవు నా గురువు కుమార్తెవు. నేను నీకు అన్నవగుదును నీవు నాకు చెల్లివంటిదానవు. నీ మనసును నీవు స్వాధీనము చేసుకోలేని స్థితిలోనున్నావు నీ వెంతటి అందగత్తె వయినను హద్దుమీరి ప్రవర్తించుట భారతనారికి తగదు. అదిగాక నీవు విద్యావతివి, పుణ్యావతివి, గాన నీ ప్రయత్నమును మానుకొనుము. నీకు కష్టములెదుకాను. వావి వరసలేక మన్మథాగ్నికి బలియై మన మిద్దరము సంభోగించిన ఆ మహాపాతకము సూర్యచంద్రాదులు వున్నంతవరకు మన మెన్ని జన్మలెత్తినను, ఏయే జన్మలెత్తినను మనలను వెంటాడుచునే వుండును. ఆ నరకబాధలనుండి మన మెన్నటికిని విముక్తి నొందజాలము కాన నీకోరిక నంగీకరింపజాలను. ఇప్పటికే చాల ఆలస్యమైనది. ఇల్లు బయలుదేరి నా వెంట వచ్చినటుల గురువర్యులకు తెలిసిననో నిన్ను వెదకుచుందురు గాన రమ్ము.

ఫలములు, కుశలు పుష్పము, మొదలగు పూజాద్రవ్యములను దోడ్కొని పోవుదము" అని సుమిత్రుడు అనేకవిధాల బోధించాడు.

అంత నా కన్యయు, బంగారము, రత్నము, విద్య, అమృతము, తనంత తానే వచ్చినప్పుడు నిరాకరించువాడు మూర్ఖుడుగాని వివేకవంతుడుగాడు. నానింకు యవ్వనాన్ని, నా శరీరాన్ని సమస్తమును నీ కర్పింతునన్న నిరాకరించుచున్నావుగదా! సరే నేనిక వంటరిగా నాగృహమునకు పోజాలను. నేనిందే ప్రాణత్యాగ మొనర్చుకొందును. నీవలన ఒక కన్య చనిపోయినదని నలువురూ నిన్ను ఆడిపోసుకొందురు. నన్నొంటరిగా యీ కారడవిలో వదలి ఇల్లుచేరినయెడల నా దండ్రి నిన్ను విడుచునా? నా కుమార్తె ఏదియని నిన్ను దండించడా? ఈ పాటికి నా చెలికత్తెలు నీతో అడవికి పోయెనని చెప్పియే యుందురు. గాన నేను కామబాధ భరించలేకున్నాను. నాతో సంభోగింపుము. నన్ను నీదానను జేసికొనుము" అని పలికెను.

సుమిత్రుడు ఆమె దీనాలాపము లాలకించి సంకటస్థితిలో పడెను. కొంత తడవు ఆలోచించి, ఆ బ్రాహ్మణకన్యతో రతిక్రీడల దేలుటకే నిశ్చయించుకొనెను.

శాంకరీ! ఈ విధముగా వారిరువురునూ ఆ తటాక సమీప మందార ప్రదేశమును శుభ్రముచేసి, అందు మెత్తని పత్రములు, నానావిధ సువాసనలు వెదజల్లు పుష్పముల బరచి ప్రకృతి సౌందర్యములను జూచి మురిసిపోయి కామతృష్ణ దీర్చుకొని, మరికొంతసేపు బలతుల్లాడి గెంతులు వేస్తూ, కేకలు వేస్తూ పరుగులిడుచూ ఆడుకొనిరి. వారి కామ వికారములనుచూచి, పక్షులు సిగ్గుపడి అచ్చోటినుండి ఎగిరిపోయినవి. సాధుజంతువులు మొగములుమాడుచుకొని అచటినుండి కదలిపోయినవి. కొలనులోని కలువలు మెడవంచినట్లు—

నీళ్ళలో వంగిపోయినవి. సూర్యుడు మబ్బుచాటున దాగున్నాడు. మాటిమాటికీ వారి అన్యోన్య చుంబనములు చూడలేక మధువు గ్రోలి మత్తెక్కియున్న తుమ్మెదలుగూడ సిగ్గుపడినవి. ఈ విధంగా వారు ఉల్లాసంగా కొంతతడవుండి సమిత్కుశ పుష్పములు, నానావిధ ఫలములు సంగ్రహించి ఇంటిముఖముపట్టి ఇల్లు చేరిరి. సుమిత్రుడు గురువునకు నమస్కరించి, తెచ్చిన పూజాద్రవ్యములు సమర్పించెను. అడవికి పోయి కష్టపడి తెచ్చిన వస్తువులను సంతోషంతో గురువు స్వీకరించి కుమార్తెనుజూచి "సుశీలా! నీవు ఉద్యానవనములోని చెలులతో బంతులాటలాడి చాల అలసిపోయి వున్నావు. పాపము! ఎందుకు నీ సుకుమార ముఖారవిందము ఎటుల వాడిపోయివున్నదో కదా! రమ్మ ఈ మధుర పదార్థములను భుజించి కొంత తడువు విశ్రమింపుము. ఆటలాడుకొనుటవలన నీవు ధరించిన ఉడుపులుకూడ నలిగియున్నవి. అని కుమార్తెను బుజ్జగించి తినుబండారములను అందించెను. ఆమె లోలోన బెదురు పైకి ఏమియు ఎరగనిదానివలె నటించెను. మరి కొంతకాలమునకు సుశీలను హిమాలయప్రాంతవాసియగు బ్రాహ్మణుడొకడు పెండ్లియాడి అత్తవారింటనే వుండిపోయెను.

మరికొంతకాలమునకు సుశీలను పెండ్లియాడిన బ్రాహ్మణుడు పరలోకగతుడయ్యెను. భర్త శవముపై బడి సుశీల యేడ్చుచున్నది. చాలా దుఃఖించెను. నవయవ్వనవతి, సౌందర్యవతి యగు తన కుమార్తెకు అకాలవైధవ్యము కలిగెనుకదా! అని గొల్లుమని ఆడదానివలె తండ్రి ఏడ్చుచుండెను. "ఓయీ భగవంతుడా! చిన్నవయసునందే ఇంకనూ సంసారసుఖమన్నది అనుభవించకనే ఈమెను విధవరాలను చేసితివా? తండ్రిదీనికాలమెట్లుతీరును? ప్రజలు విధవను జూచినయెడల అమంగళకరమని భావింతురే? ఏ శుభకార్యములయందును పాల్గొననివ్వరుకదా! దీనికి కర్మ నేలా కలిగించితివి!" అని పరి పరి విధములుగ దుఃఖించెను. అంతలో అచ్చోటికి ఒక సిద్ధపురుషుడు

భిక్షాటనకై వచ్చెను. ఆ సమీపమునందే ఒక మూల ఏడుపులు వినబడుచున్నందున శవమున్న చోటకు వెళ్ళి సుబుద్ధితో - "ఆర్యా! మీరు దుఃఖించుటకు కారణమేమి? త్వరగా చెప్పుడు" అని పలికెను.

అంతట సుబుద్ధి సిద్ధపురుషునితో స్వామీ! మా దుఃఖముగురించి ఏమని చెప్పుకొందును. మీ తేజస్సు చూచుటవలన కొంత ఉపశమనం కలిగినది. ఈ బాలిక నా కుమార్తె. ఆ చనిపోయినవాడు ఆమె భర్త. వివాహమైన కొలది దినములకే ఈతడు చనిపోయినాడు. మాకు ఈమె తప్ప మరెవ్వరునూ లేరు. చిన్నతనములోనే ఈమెకు కల్గిన వైధవ్యమును చూడలేక మా హృదయములు బ్రద్దలగుచున్నవి. ఇదియే మా దుఃఖానికి కారణం. ఈమె కీ దుస్థితి ఎందుకు కలిగెనో ఈమె పూర్వజన్మ మెటువంటిదో మీకు తెలిసియున్నయెడల సెలవిండు" అని వేడుకొనెను.

సిద్ధుడు కొంతతడవు తన దివ్యదృష్టిచే అంతా గ్రహించి, "విప్రవర్యా! నీ కుమార్తె వెనుకటి జన్మలో క్షత్రియ యువతిగా వుండేది. ఈమె కామాతురత గలదగుటచే కొంతమంది పరపురుష సంపర్కము కలిగివుండి, తన భర్త నిద్రలో నుండగా అర్ధరాత్రి, నిశా సమయమున కత్తితో పొడిచినందున అతడు విలవిల తన్నుకొని ప్రాణములు విడచెను. ఆ రక్తపాతము భయానకదృశ్యము చూచి ఆమె భయపడి తానుకూడ ఆ కరవాలముతో పొడుచుకొని చనిపోయినది. అటువంటి ఘోరహత్య చేసి, ఈ జన్మలో నీ కుమార్తెగా పుట్టినది. ఆమె చేసియున్న దోషమువల్లనే నీ అల్లుడు చనిపోయాడు. ఆమెకు చుట్టుకున్న పాతకమువలననే విధవరాలైనది. అంతటి పాపాత్మురాలు అయినప్పటికి పుణ్యాత్ములగు మీకు ఎలా జన్మించినదో ఆ వృత్తాంతము గూడ వివరించెదను వినుము.

చాలా సంవత్సరాల క్రిందట అనగా - నీ కుమార్తెయొక్క పదునాల్గు జన్మల వెనుక మాఘమాసములో సూర్యభగవానుడు మకర

రాశియందుండగా, కొంతమంది బ్రాహ్మణస్త్రీలతో కలసి యమునానదీ తీరమునకు బోయి, స్నానముచేసి ఇసుకతో గౌరీదేవి ప్రతిమను జేసి భక్తిశ్రద్ధలతో పూజలు చేయుచుండిరి. ఆ బ్రాహ్మణస్త్రీలు చేసే గౌరీదేవి పూజలో నీ కుమార్తెగాపుట్టిన ఈమెకూడా పాల్గొనుటవలన ఆ వచ్చిన పుణ్యఫలంచేతనే నీ వంశములో నీకు కుమార్తెగా పుట్టినది. అయిననేమి? నీ శిష్యునితో రహస్యంగా అడవికిపోయి తన కామవాంచ కొఱకు, అతనితో రమించినది. అందువలననే యీ వైధవ్యం కలిగినది. పూర్వజన్మవలన పవిత్రమైన నీ యింట పుట్టిననూ ఘోరపాపము చేసివున్నందున తన మగనిని పోగొట్టుకొని విధవరాలైనది. కనుక పూర్వజన్మలో చేసిన పాపకర్మ, ఈ జన్మలో పాపకర్మవలననే కుమార్తెకు అకాల వైధవ్యము కలిగినది. ఇప్పుడు దుఃఖించిన లాభ మేమున్నది? కానున్నది కాక మానదు. మనుష్యుడు తాను చేసిన పాపపుణ్యాల ఫలితం ఎప్పటికైననూ అనుభవించవలసినదే కదా! దేవతలకైనను కష్టములు తప్పవు'' అని పలికిన సిద్ధుని మాటలకు సుబుద్ధి ''హరిహరీ! నే నెంతటి పాపపు మాటలు వినవలసివచ్చినది. పూర్వజన్మలో యీ నా కుమార్తె తన భర్తను హత్యచేసి తానూ ఆత్మహత్య చేసుకొన్నది? సరే ఈ జన్మలోకూడా కన్యగావుండి నాకు కుమారునితో సమానుడు, తనకు సోదరుడులాంటివాడని గ్రహించక నా శిష్యునితో కూడినదా! ఆహా! ఎంతటిఘోరము?'' అని మనసులో విచారించి ఆ సిద్ధుని జూచి ''స్వామీ! మీ పలుకులాలకించినది మొదలు ఒకవైపు పుత్రికపై కోపము మరొకవైపు ప్రేమ కలుగు చున్నవి. గాన కుమార్తె పాపమునుండి ఎటుల విముక్తురాలగునో తిరిగి నా అల్లుడు ఎటుల పునర్జీవితుడగునో మీరు వినిపించవలసినదిగా కోరుతున్నాను'' అని పలికెను.

ఓ సుబుద్ధీ! నీ కుమార్తె గురించి నీ వడగకపోయిననూ తన్నివార ణోపాయము వివరించవలయుననియే నేను యిలావచ్చినాను. ఈమాఘ

మాసంలో నీకుమార్తెచేత నదిలోగాని చెరువులోగాని సూర్యోదయం కాగానే స్నానముచేయించి, అచటనే ఇసుకతో గౌరీదేవినిచేసి ముత్తయిదువులతో కలసి ధూపదీప నైవేద్యము లిచ్చి పూజలు చేయించుము. ఈ విధముగా మాఘమాసమంతయు నీకుమార్తెచేత చేయించిన యెడల ఆమెకున్న పంచమహా పాపాలన్నీ తొలిగిపోయి ఆమె భర్తకూడ బ్రతుకును.

మాఘశుద్ధ విదియనాడు ముత్తదువుల పాదములకు పసుపురాసి నుదుటబొట్టుపెట్టి పూజచేయవలెను. రెండు క్రొత్తచేటలు తెచ్చి అందొక చేటలో చీర, రవికలగుడ్డ పసుపు కుంకుమ, పండ్లు, తమల పాకులు, వక్కలు దక్షిణ పెట్టి దాన్నిపై రెండవచేట మూతవేసి ఆ ముత్తైదువునకు సంతుష్టిగాభోజనము పెట్టి సంతోష పెట్టవలయును. ఆ విధముగా చేసినయెడల పరపురుష సాంగత్యము వలన కలిగిన దోషము నివారణ యగును.

కొంతమంది పురుషులు ఉదయముననే నదికిపోయి స్నానము చేయవలయునన్న అయిష్టత చూపుదురు గాన, అట్టివారల భార్యలయి నను వారిని ప్రోత్సాహపరచి, వారుకూడా నిష్టతో మాఘమాసస్నాన ములు చేయవలయును. వంశాభివృద్ధికిగాని. కుటుంబ గౌరవానికిగాని, స్త్రీయే ప్రధాన కారకురాలు కనుక ఈ మాఘమాసస్నానముతప్పక స్త్రీ ఆచరించవలెను. ఈ మాఘమాసమంతయు పురాణములు చదివి హరికథలుగాని హరినామ కీర్తనలుగాని ఆలకించుచు, దాన ధర్మ ములు చేసినయెడల దానికన్న ఫలితముమరొక ఏ వ్రతమందునూ కలు గదు. మునిసత్తములు మాఘమాస స్నానములు చేసి తపస్సు చేసు కొన్నచో వారు సిద్ధులగుదురు. మతిలేనివారలచే మాఘస్నానములు విడువక చేయించినయెడల వారిపిచ్చి కుదురును. కుష్ఠువ్యాధితో బాధ పడువారల మాఘస్నానములుచేసిన, వారికి రోగనివృత్తియగుటయే గాక మంచి పుణ్యాత్ములగుదురు. స్త్రీగాని, పురుషునుగాని, మాఘ

మాస స్నానములు డాంబికములతో - నలుగురుచూచి పొగడుతున్నట్టుగా గాక చిత్తశుద్ధితో స్నానములుచేసి విష్ణు దర్శనము, సూర్య నమస్కారములు, పురాణములు చదువుట హరినామ సంకీర్తనలు చేయుట మొదలగునవి నిరాడంబరముగా చేయవలయును మాఘమాస స్నానములు చేయుచున్నానని తన్ను తాను పొగడుకొనరాదు అటుల చేసిన "చిత్తశుద్ధిలేని శివపూజలేలయా" అనురీతిగా నిష్ప్రయోజనము లగును. అని సుబుద్ధికి బిక్షాటనకై వచ్చిన సిద్ధుడుపదేశించెను.

ఓ శాంకరీ! ఆవిధముగా సిద్ధుని ఉపదేశములు పొందిన సుబుద్ధి తనకుమార్తెచేతమాఘస్నానములు ఆచరింపజేసి దాన పుణ్యములు చేయించగా చనిపోయిన అల్లుడు తిరిగి నిద్రమేల్కాంచినవానివలె లేచి జరిగిన వృత్తాంతమును విని తానుకూడ తనభార్యతో పుణ్య కార్యములను చేసి పాపరహితుడయ్యెను.

# 13వ అధ్యాయము

## శిష్యుడు పశ్చాత్తాపము పొందుట

సుబుద్ధియు అతని కుమార్తె అమెభర్త మొదలగువారు మాఘ స్నానమువలన కలిగినఫలితముచే సమస్తదోషమును పోగొట్టుకొని సుఖించిరని సాంబశివుడు పార్వతికి తెలియజేయగా తిరిగి నీలకంఠుని పార్వతీదేవి ఇట్లు ప్రశ్నించెను.

"నాథా! సుబుద్ధికుమార్తె వృత్తాంతమును ఆమూలాగ్రముగ తెలియజేసితిరి మరి సుబుద్ధి శిష్యుడగు సుమిత్రుడేమైనాడు? అతడే స్థితిలో నున్నాడు? వివరింపుడు వినకుతూహలముగానున్నది" అని సాంబశివుని కోరినది. అందులకా పార్వతీపతి యిట్లు వివరించెను.

"సుమిత్రుడు గురువుగారికుమార్తెతో సంభోగక్రీడలు దేలియాడినది మొదలు అతనికి ఘోరపాపమంటెను తానుచేసిన పాపమునకు ఫలిత మనుభవించుచుంటినిగదా యని పశ్చాత్తాపమనస్కుడై గురువు గారివద్దకు పోయి గురువుపాదములపై బడి" గురువరా! నేను మహా

పాపినైతిని. క్షణభంగురమైన తుచ్ఛ కామవాంఛకు లోబడిపోయి నీకుమార్తెయగు సుశీలతో కూడితిని. అయినను అదినాదోషము కాదు. నేను పూజాద్రవ్యములు తెచ్చుటకు అడవికి పోవుచుంటిని. దారి యందున్న ఉద్యానవనంలో నీకుమార్తె చెలికత్తెలతో బంతులాడుచు నేను ఏకాంతముగా పోవుటచూచి నెమ్మదిగా నావెంటవచ్చినది నేను అటు అడవిమధ్యకు పోయి ఒక కోనేటివద్దనున్న చెట్టుక్రింద విశ్ర మించగా నీకుమార్తె మెల్లమెల్లగా నాచెంతజేరి నన్ను మంచిమాట లలో వంచించి తన కామవాంఛ తెలియజేసినది. నేనందులకు ఒప్పు కొనలేదు. నన్ను బలవంతముపెట్టినది. నన్నుక్షమించమని చెవులు మూసుకొంటిని. ఇక లాభంలేదని "నాతో నీవు క్రీడించకుందువేని నీ ఎదుటనే ప్రాణత్యాగ మొనరించుకొందును" అని చెప్పుసరికి నాకు భయముకలిగి నిజంగా ఆమె ప్రాణత్యాగమే చేసుకున్నచో మీరు నన్ను తప్పక దండించెదరని వెరచి ఆమెతో క్రీడించి, ఆమె వాంఛను తీర్చితిని. ఇందు నా తప్పేమిలేదు. ఐనను నేను మహాపాప మనుభ వించుచున్నాను. నేనుకూడ పాపరహితుడ నెటులకాగలనో సెల విండ"ని బ్రతిమాలెను.

శిష్యుడు పలికిన మాటలు సుబుద్ధి విశ్వసించి, తన కుమార్తె వలె తన శిష్యునిగూడ పాపరహితుని జేయనెంచి సుమిత్రా! నీ పాప కర్మకు ప్రాయశ్చిత్తమున్నది. నీవును మావలె పాపరహితుడవు కాగలవు. అదెటులనిన నీవు గంగానదీ తీరమునకు వెళ్ళి అచట పన్నెండు సంవత్సరాలు తపస్సుచేసుకొనుము. ఆ తపస్సుచే కలుగు ఫలితమువలన పాపము మబ్బు విడిపోయినటుల నశించుపోవును. అప్పుడు నీవు ముక్తుడగుదువు అని శిష్యునితో జెప్పెను.

''ధన్యోస్మిధన్యోస్మి'' మీయాజ్ఞప్రకారము నేనిప్పుడే ప్రయాణ సన్నద్ధుడనగుచున్నాను'' అని గురువర్యులకుదండప్రమాణములాచరించి గంగానదీతీరమునకు బయలుదేరెను. అటుల ప్రయాణమై సాగిపోవు

చుండగా మార్గమధ్యమున గుట్టలు, కొండలు, సెలయేళ్ళుదాటి ఒక అరణ్యమధ్యమునకు వెడలెను అచట మనోహరమైన ఆహ్లాద మొనరించు దృశ్యములు కనుపించినవి. కౄరమృగములు సాధు జంతువులు కలసి మెలసి తిరుగుచున్నవి. మయూరములు, సర్పములు విచ్చలవిడిగా తిరుగుచున్నవి. పరస్పర వైరుధ్యములు ఏ మాత్రము కనిపించలేదు. అచట ప్రకృతి రమణీయత మనస్సున కానంద మొన రించుచున్నది. అట్టిప్రాంతమందు ప్రయాస బడలిక తీర్చుకొందమని ఒక వటవృక్షముక్రింద విశ్రమించి, నలుదిశల పరికించిచూడగా ఒక ఆశ్రమము కనిపించినది.

వెంటనేలేచి ఆయాశ్రమంవద్దకువచ్చితొంగిచూడగా ఆయాశ్ర మములో కొంతమంది పురుషులు, స్త్రీలు, బాలికలు కాషాయాంబర ములు ధరించి రుద్రాక్షమాలలను త్రిప్పుచు శ్రీమన్నారాయణుని ఫలపుష్ప ధూపదీప నైవేద్యములతో పూజించుచు మాఘపురాణ పఠనము చేయుచుండిరి. మధ్యమధ్య శ్రీహరి విగ్రహంపై అక్షతలు వేసి "హరిహరీ" యని బిగ్గరగా కేకలువేయుచు భక్తిశ్రద్ధలతో ఆనం దోత్సాహములతో పూజచేయుచుండిరి. అదృశ్యమంతటినీ సుమిత్రుడు కనులార గాంచెను. పూజపూర్తయిన తరువాత ప్రసాదం అందరూ సేవించిరి. బైట కూర్చుని వున్న సుబుద్ధికికూడ ప్రసాదమివ్వగా "స్వామీ! మీరాచరించిన వ్రతమెట్టిది? దీనివలన ఫలితమేమి కలు గును? మనుజుడు పాపరహితుడగునా? ఈ నాసందియములను దీర్ప వేడుచున్నాను" అని వినయముగా ఆ మునిసత్తముల నడిగెను.

పాపములచే పీడింపబడుచున్న సుమిత్రుని ప్రార్థనవిని అచట నున్న మనుజులందరూ మాఘమాస మందాచరించవలసిన ధర్మమును అతనికి వివరించుటకుగాను వారిలో నొకరిని నియమించిరి అంత నా మునికుమారుడు సుమిత్రునితో మాఘమాస మహాత్మ్యమును ఇట్లు వివరించెను.

"విద్యార్థీ ! మేము చేసినది మాఘమాసమందాచరించవలసిన మాఘమాసవ్రతము ఈ వ్రతము చేయుటవలన ఎటువంటి పాపములు చేసిననూ, వాటి నన్నింటినీ నశింపచేయును. అనగా రౌరవాది నరక బాధలు వెంటాడుచున్నప్పటికిన్నీ ఈ వ్రతము చేసినంతమాత్రమున అవి యన్నియు పెనుగాలికి ఎండుటాకులు ఎగిరిపోవునట్లుగా, పాపము లన్నియు నశించిపోవును. మాఘమాసములో సూర్యుడు మకరరాశిలో వుండగా ఆ దినము సూర్యోదయ సమయమందు ఒక నదియందు ఏ మనుజుడు స్నానముచేయునో అట్టిమనుజుడు శ్రీహరికి ప్రియుడగును. ఎట్టిదోషము లేకుండా శ్రీహరిని పూజిస్తూ మాఘపురాణమును వినుచు ఆ మాసమంతయు నదీస్నాన మొనర్చువారు వైకుంఠవాసులగుదురు. అలాగున చేయనివాడు, అసత్యములాడువాడు, పెద్దలను, గురువులను గౌరవించనివాడు, భక్తులను చూచి ఎగతాళిచేయువాడు, పరస్త్రీలను బలాత్కరించి చెరుచువాడు, చోరత్వము చేయువాడు, బ్రహ్మహత్య చేయువానితో సమానుడు అటులనే ఇండ్లు తగులబెట్టుట, అబద్ధ సాక్ష్యములు చెప్పుట, జనసమర్ధముండుచోట మలమూత్రములను విడచుట, గుఱ్ఱములను పశువులను కన్యలను ఇతరులకమ్ముట, మొద లగునవి, చేయువారుకూడ బ్రహ్మహత్య చేసినవారితో సమానము. మరియు దైవసంబంధమగు ధనమును అపహరించువాడు, ఏ పుణ్య దినములలోనైన శుచిగా స్నానముచేసి దేవుని ప్రార్థించనివాడు, దాన మిచ్చెదనని వాగ్దానముచేసి ఇవ్వనివాడు, బంగారము,వెండి,రత్నములు సాలగ్రామములు దొంగిలించువాడును, జాతిభ్రష్టుడై జార చోరత్య ములు చేసి వేశ్యయింటికి తిరుగువాడు వీరందరూ బ్రహ్మహత్యాది మహాపాతకములు చేసినవారితో సమానులగుదురు. ఇవిగాక అన్న భార్యను సోదరుని భార్యను, గురువు భార్యను, స్నేహితుని భార్యను కూడి రతిసల్పువాడును, తనకన్న వయసులో పెద్దయగు స్త్రీతో రతి సల్పువాడును, జీవహింసలు చేయువాడును, బీదప్రజలను హింసించు

వాడును, దోపిడీలు చేయువాడును మహాపాతకులు. అట్టివారుకూడ బ్రహ్మహత్య చేసినవారితో సమానుడు. ఇవిగాక తల్లిదండ్రులను హింసించువాడును, వివాహసంబంధములు చెడగొట్టువాడును, నోరులేని పసిపాపల దొంగిలించి ఇతరులకు అమ్మువాడును, శరణుజొచ్చినవానిని దండించువాడును, ధర్మకార్యములకు విఘ్నములు కలిగించువాడును, పరధనము అపహరించువాడును, చేసిన మేలు మరచిన కృతఘ్నుడును, తాను తీర్థయాత్రలు చేయక అట్లు చేసినవానిని జూచి ఎగతాళిచేయు వాడును బ్రహ్మహత్య చేసినవానితో సమానుడగును.

గాన మేము ఆచరించిన వ్రతం మాఘమాస వ్రతం. ఈ వ్రతం చేయుటవలన మాకు ఏమాత్రమూ పైన చెప్పిన మహాపాతకములలో ఏ ఒక్కటి వున్ననూ అవి నశించిపోవును. ఇది ముమ్మాటికీ నిజం. అందుచేతనే మేమందరము మాఘమాసవ్రతం భక్తిశ్రద్ధలతో ఆచరించుచున్నాము.

మాఘమాసం ప్రారంభముకాగానే సూర్యుడు ఉదయించిన కొద్దిసేపటికి నదికిపోయి స్నానంచేసి సూర్యునికి నమస్కరించి, నీళ్ళు విడువవలెను. తరువాత విష్ణుమందిరమునకుపోయి శ్రీహరికి పూజచేసి, తులసితీర్థము ప్రసాదం పుచ్చుకోవలెను. ఆ విధముగా మాసాంతము వరకు ఏ మనుజుడు ఆచరించునో అట్టివాడు అశ్వమేధయాగము చేసినంత ఫలితం కలుగును. మాఘమాసమునకు శ్రీహరియే అధిదేవత గాన యీ మాసమందు ఆచరించిన స్నానమువలన కల్గు ఫలము నిచ్చువాడు అతడేగనుక ఆ వైకుంఠవాసుడగు శ్రీహరిని పూజించవలెను. శ్రీమన్నారాయణుడు ఒకవేళ నదీతీరమందుగాని, చెఱువుదగ్గరగాని విష్ణుమందిరము లేకపోయినచో విష్ణుమూర్తి విగ్రహమునుగాని విష్ణు పటమునుగాని తీసుకువెళ్ళి నదీతీరమందు తులసీదళంతోను కస్తూరి గంధం, అగరు దూపదీపనైవేద్యం ఫలపుష్ప తాంబూలాదులతో పూజించి పురాణశ్రవణము గావించవలయును.

ఈ విధముగా మాఘమాసమంతా చేసి మాసాంతమున ఒక సద్బ్రాహ్మణునకు వస్త్రములు, బంగారము దక్షిణ ఇచ్చి సంతృప్తిగా పిండివంటలతో భోజనము పెట్టాలి. ధనమున్నవారు బ్రాహ్మణ సమారాధన చేసినయెడల ముక్కోటిదేవతలు సంతసించుటేగాక యముడు తన దూతలను పంపజాలడు. పునర్జన్మ కలుగదు. ఈ నావచనములు అసత్యములు కావు. ఇప్పటి వరకూ మాఘ స్నాన ఫలిత మంతయు విన్నావుగదా! ఇక మాఘమాసం మూడుదినాలు మాత్రమే వున్నది. గాన ఈమూడు దినములలోను ఈనదిలో స్నానముచేసి పూజా కార్య క్రమమునకు సంసిద్ధుడవుకమ్మని అని మునీశ్వరులు'' తెలియ జేసెను.

అంత సుమిత్రుడు, తనగురువగు సుబుద్ధి తన పాపపరిహారార్థము గంగానదీ తీరమునకు బోయి తపస్సు చేసుకొమని చెప్పినారు. అని మునీశ్వరునితో చెప్పగా – మరల ఆ ముని యిట్లు చెప్పినాడు.

"నీగురువు చెప్పిన విషయం యదార్థము. నీగురువు పుత్రికతో గూడి రతిసల్పినావు. అందు నీదోసమేమియు లేకున్ననూ మహాపాపము మాత్రము సంక్రమించినది. అది నిన్ను వెంటాడుచునే యున్నది. తరుణోపాయము చేయనిచో ఈజన్మలోను మరుజన్మలోను కూడ నరక బాధలు తప్పవు. గాన ఆమాఘమాసమందలి మూడుదినము లయినను స్నానముచేసి, శ్రీహరిని పూజించుము. తరువాత నీవు గంగా తీరమునకుపోయి నీగురువు చెప్పినవిధముగా భక్తితో తపస్సు చేసినయెడల నీవు జన్మరాహిత్యమును పొందగలవు మానవుని మనస్సు స్వార్థము, చంచలభావము గలది. నీవు ఇంద్రియాలన్నింటిని బంధించి ఏకాగ్రచిత్తముతో లక్ష్మీనారాయణుని ధ్యానించుము. ''అని ఉపదేశించగా సుమిత్రుడు అచ్చట మూడుదినములుండి మాఘస్నానములు చేసి, నదీతీరమందు విష్ణువును పూజించి, పురాణపఠనము గావించెను. తదనంతరము ఆ ఆశ్రమవాసులకు నమస్కరించి గంగా నదీతీరమునకు తపస్సు జేయుటకై వెళ్ళిపోయెను.

# 16వ అధ్యాయము

## ఆడకుక్కకు విముక్తి కలుగుట

దిలీపమహారాజా! సుమిత్రుని కథ ఈశ్వరుడు పార్వతీదేవి చెప్పినరీతిగా విన్నావుకదా! ఇంకొక కథను పార్వతికి ఈశ్వరుడు ఈ విధముగా చెప్పెను. అదెట్లన—

మాఘమాసములో మాఘస్నానములు చేయువాడు గొప్ప ధనశాలి యగును. వర్తమాన కాలమందు ఎన్ని కష్టములు అనుభవించుచునప్పటికీ మాఘస్నానము మొదలిడిన తరువాత వారి కష్టములు క్రమేపీ సమసిపోవును. మాఘశుద్ధ దశమినాడు నిర్మలమైన మనస్సుతో శ్రీమన్నారాయణుని పూజించినయెడల శ్రీహరి కటాక్షమునకు పాత్రుడగును. అందులో అణుమాత్రమైననూ సంశయము లేదు. అని పార్వతీదేవితో శంకరుడు వివరించుచుండగా పార్వతీ మరల ఇట్లు పలికెను.

"నాధా! శ్రీలక్ష్మీనారాయణుల వ్రతము చేసినయెడల మనోవాంఛా ఫలసిద్ధి కలుగునని చెప్పియుంటిరిగదా! ఆవ్రత విధానమెట్టిదో ఎటుల ఆచరించవలెనో వివరముగా తెలియపరచు" డని పార్వతీ దేవి పరమేశ్వరుని కోరినది

అంతమహేశ్వరుడు పార్వతితో ఇట్లు చెప్పసాగెను" మాఘశుద్ధ దశమినాడు ప్రాతఃకాలమున కాలకృత్యములు తీర్చుకొని స్నానముచేసి నది ఒడ్డునగాని, ఇంటివద్దగాని, మంటపమువుంచి, ఆ మంటపమును ఆవుపేడతో అలికి పంచరంగులతో ముగ్గులు పెట్టి మంటపము మధ్య ఎనిమిది రేకుల పద్మమువేసి అన్నిరకాల పుష్పములు ఫలములు తీసుకువచ్చి లక్ష్మీనారాయణులను మంటపపుమధ్యమున వుంచి గంధము, కర్పూరము, అగరు మొదలగు ద్రవ్యములు విగ్రహాలకు రాసి పూజించవలెను.

రాగిచెంబులో నీళ్ళుపోసి, మామిడిచిగుళ్ళును వుంచి దానిపై కొబ్బరికాయపెట్టి, క్రొత్తవస్త్రము నొకదానిని కప్పి లక్ష్మీనారాయణుల ప్రతిమ ప్రతిష్ఠించి పూజించవలెను. ఆ మంటపపు మధ్యలో సాలగ్రామమును వుంచి యొకసద్బ్రాహ్మణుని ఆహ్వానించి, వారిచేత పంచామృతస్నానం చేయించి, తులసి దళములతోను, పుష్పాలతోను పూజించి, ధూపదీప చందనాగరు పరిమళ వస్తువులుంచి నైవేద్యము చెల్లించవలెను.

తరువాత రాగిపాత్రలో నీరుపోసి ఆర్ఘ్యప్రధాన మివ్వవలెను. అటు తరువాత సూర్యనారాయణ స్వరూపుడగు శ్రీరామచంద్ర ప్రభువును మదిలో ధ్యానించవలెను.

మాఘమాసస్నానం చేయువారు వారి తల్లిదండ్రులు బంధుమిత్రుల సమక్షములో మాఘమాసవ్రతము చేయవలయును. ఒక సద్బ్రాహ్మణునకు బియ్యము, బెల్లము. వుప్పు, పప్పు కాయగూరలు పండ్లు మొదలగునవి ఒక పాత్రయందు వుంచిగాని, క్రొత్త గుడ్డలో మూటగట్టిగాని, దానమియ్యవలయును మాఘపురాణమును స్వయముగా పఠించునపుడుగాని లేక వినునప్పుడుగాని చేతిలో అక్షతలు వుంచుకొని భక్తితో శ్రీమన్నారాయణుని ధ్యానించుకొని కొన్ని అక్షతలు భగవంతునిపై వుంచి మరికొన్ని అక్షతలు తలపైవేసుకో వలయును. గాన ఓ శాంభవీ! మాఘస్నానము చేసి మాఘశుద్ధదశమి నాడు లక్ష్మీనారాయణులను నిష్టతో పూజించినయెడల ఎటువంటి మహాపాపములైనను నశించిపోవును, ఇందులకొక ఉదాహరణకూడ తెలియజేసెదను సావధానురాలవై వినుము.

గౌతమ మహర్షి ఒకనాడు తన శిష్యులతో గూడి తీర్థయాత్రలు చేయుటకై ఉత్తరదిశకు బయలుదేరాడు. వారు అనేకపుణ్యనదులలో స్నానములు చేయుచు ప్రసిద్ధక్షేత్రములను దర్శించుచు మార్గమందున్న మునిపుంగవులతో ... అప్పటికి మాఘ

మాసము ప్రవేశించుటవలన కృష్ణానదిలో స్నానము చేయవలయునని ఆ ప్రాంతమునకు వచ్చి విడిదిచేసిరి.

గౌతమముని తన శిష్యునితో గూడి కృష్ణానదిలో సూర్యోదయ సమయములో స్నానముచేసి తీరముననున్న ఒక రావిచెట్టువద్దకువచ్చి

శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ, మధ్యతో విష్ణురూపిణే
అగ్రతశ్శివరూపాయ, వృక్షరాజాయ తే నమః॥

అని రావి చెట్టునకు నమస్కరించి ఆ చెట్టు మొదట ఆసీనులయి శ్రీహరిని విధియుక్తముగా పూజించిరి. తరువాత శిష్యులందరికీ మాఘమాస ప్రభావమును వినిపించిరి. ఈ విధముగా ప్రతిదినము ఆచరించు చుండగా మాఘశుద్ధ దశమినాడు ఆ చెట్టు మొదట మండపమేర్పరచి ముగ్గులు, బొట్లు పెట్టి మామిడాకు తోరణాలుకట్టి అలంకరించారు. ఆ మండపము మధ్యలో శ్రీహరి చిత్రపటము వుంచి పూజించినారు. ఆ విధంగా పూజించుచున్న సమయంలో ఒక ఆడు కుక్క వచ్చి భగవంతునికి చేయుచున్న పూజావిధానమంతయు రెప్పవాల్చకుండా దీక్షతో చూచుచు, ఆ రావిచెట్టునకు ఎదురుగా కూర్చొనివుండెను శిష్యులు వారివద్దనున్న దండముతో దానిని బెదరించిరి. ఆ కుక్క అచటినుండి లేచి ఉత్తరదిశవైపు మళ్ళి మరల తూర్పువైపునకు తిరిగి, అవైపునుండి దక్షిణదిశకు కదలి మరల యథాప్రకారము పడమటి దిశలోనేకూర్చుండెను. శిష్యులు మరల బెదరించిరి, ముందు చేసినటులే రెండవసారికూడా ఆ మండపంచుట్టూ తిరిగి వచ్చెను శిష్యులు మూడవసారి కూడా వారి దండములతో బెదరగొట్టగా మరల ఆకుక్క రావిచెట్టు చుట్టూ తిరిగి వచ్చినది. అప్పటికి మూడుసార్లు ఆ మండపము చుట్టూ ప్రదక్షిణము చేసినందున, అది మాఘమాసము అయివున్నందున వెంటనే అ కుక్కరూపము వదలి ఒక రాజుగా మారిపోయాడు. ఆ రాజు సకలభరణాలు ధరించిన వాడై - మునుల ఎదుట నిలబడి మునులందరికీ నమస్కరించెను.

అక్కడ నున్న ఆకుక్క రాజుగా మారిపోవుట, చూచిన మునులు గౌతమ మహర్షి కూడ అమితాశ్చర్యము నొందిరి.

ఓయీ! నీవెవ్వరవు? నీవిట్లు మారుటకు కారణమేమి? అని గౌతముడు ప్రశ్నించాడు.

మునిచంద్రమా! నేను కళింగరాజును. మాది చంద్రవంశము నా పేరు జయచంద్రుడు. నాకు అన్ని విద్యలయందునూ ప్రావీణ్యం గలదు. నా దేశ ప్రజలను ధర్మమార్గమున పరిపాలన చేయుచూ వున్నాను. దానధర్మములనిన నాకు అతిప్రేమ. నేను అనేకదానాలు చేసియుంటిని. గోవు, భూమి, హిరణ్య సాలగ్రామదానాలుకూడా చేసి యున్నాను. ఎక్కువగా అన్నదానము తిలదానము చేసియున్నాను. అనేక ప్రాంతాలలో చెరువులు త్రవ్వించినాను. నూతులు త్రవ్వించి బాటసారులకు నీడనిచ్చు నిమిత్తం చెట్లను నాటించినాను. ధర్మ శాలలను కట్టించినాను. పశువులు త్రాగుటకు నీటిగుంటలు త్రవ్వించి నాను. నిత్యము బీదప్రజల నిమిత్తము అన్నసత్రములు, మంచినీటి చలివేంద్రములు, మరెన్నో పుణ్యకార్యాలు చేసియున్నాను. అనేక దేవాలయాలను నిర్మించి, దైవవిగ్రహాలను ప్రతిష్ఠించినాను. సద్బ్రాహ్మణులచేతను, వేదాలు చదువు పండితులచేతను యెన్నో క్రతువులు చేయించినాను. పురాణాలలో వున్న అన్ని ధర్మాలను చేసియున్నాను కాని నేనిలా కుక్కనయ్యాను. దానికి కారణము లేకపోలేదు. ఆ కారణముకూడా మీకు విశదపరచెదను వినుడు.

ఒకానొక దినమున ఒక మునిపుంగవుడు గొప్ప యజ్ఞ మొకటి తలపెట్టాడు. యజ్ఞముచేయాలన్న సామాన్య విషయము కాదు కదా! దానికి కావలసిన ధనము వస్తుసముదాయము చాల కావలెను. గాన ఆ మునిపుంగవుడు నావద్దకువచ్చి అర్థించెను. మునిసత్తముడు వచ్చిన వెంటనే ఎదురేగి కాళ్ళుకడిగి ఆ నీళ్ళు నా శిరస్సుపై జల్లుకొని కుశల ప్రశ్నలడిగితిని. మునియు నా సత్కారమునకు మిక్కిలి సంత

సించి రాజా! నీకు గుప్త విషయములు తెలియజేయుదును. ఈ మాసములో మకరరాశియందు సూర్యుడు ప్రవేశించును. ఆ దినము సూర్యోదయము అయిన తరువాత నీవు స్నానముచేసి భక్తిశ్రద్ధలతో మాఘమాస మహాత్మ్యములు చదువుటగాని లేక వినుటగాని చేయుము దానివలన నీకు వైకుంఠప్రాప్తి కలుగును. అంతియేగాక అశ్వమేధయాగము చేసినయెడల ఎంతటి ఫలితము కలుగునో అంతటి ఫలముగాని, తీర్థస్నానాలు చేయగా వచ్చిన ఫలముగాని లేక దాన పుణ్యములు అనగా పంచయాగాలు చేసినంత ఫలముగాని పొందగలవు. మాఘశుద్ధ సప్తమీ ఆదివారం వచ్చినగాని, దశమీ ఆదివారం వచ్చిన గాని. ఉదయమే స్నానము చేసినను మరియు మాఘ పౌర్ణమిరోజు ఉదయమున స్నానము చేసినచో మానవుడు ఎటువంటి పాపములనైనను విడువగలడు.

ఒకవేళ ఇతరజాతులవారైననూ మాఘమాసమంతట నిష్టతో నదీ స్నాన మాచరించి దానధర్మాలు మాఘపురాణము పఠించినను లేక వినినను మరుజన్మలో బ్రాహ్మణుడై జన్మించును. అని ఆ ముని వర్యుడు నాతో చెప్పగా నేను అతనిని అవమానించినటుల మాట లాడి ఇట్లంటిని.

"అయ్యా మునిసత్తమా! మీరు పలికిన విషయములు నాకు తెలియును. అవన్నియు బూటకములు. వాటిని నేను యదార్థములని అంగీకరింపను. ఏవో అతిశయోక్తులు తప్ప మరొక్కటి కాదు. గాన నేను మాఘస్నానములు చేయుటగాని, దాన పుణ్యాదులు జేయుట గాని. పూజానమస్కారములు ఆచరించుటగాని చేయును. చలి దినము లలో చన్నీళ్లు స్నానములు చేయుట ఎంతకష్టము! ఇక నాకు ఈనీతి బోధలు చెప్పకుడు నాకున్న ఫలముచాలు" అని ఆ మునితో అంటిని.

నా మాటలకు మునికి కోపంవచ్చినది. ముఖం చిట్లించుకొని సరే, నేను చెప్పవలసినది చెప్పితిని అది నా ధర్మము అని యజ్ఞము నకు కావలసిన ధనమును తీసుకోకుండా వెడలిపోయినాడు.

అంతట నేను ఆ ముని చేతులుపట్టి బ్రతిమిలాడగా ఎట్టకేలకు ముని అంగీకరించి ధనము తీసికొనిపోయెను.

ఆ విధముగా నేను కొంతకాలము రాజ్యమేలి ప్రాణములు విడిచితిని. తరువాత నాకు కుక్కజన్మ వచ్చినది. ఏడుజన్మలూ నాకు కుక్కజన్మయే వచ్చినది. నా పాపఫలమే మోగాని కుక్కగా ఏడుజన్మలూ బాధపడితిని. ఇప్పుడు మీరు చేయు పూజాస్థలము చుట్టూ మూడు పర్యాయములు ప్రదక్షిణాలు చేసితినిగాని నా పూర్వ జన్మ నాకుకలిగినది. దైవయోగమును ఎవ్వరునూ తప్పించలేరుగదా! ఇటుల కుక్కజన్మలో వుండగా మరల నాకు పూర్వజన్మ ఎటుల సంక్రమించినదో వివరింప వేడెదను.'' అని రాజు పలికెను.

ఆ రాజు చెప్పిన వృత్తాంతమునకు ఆ ముని ఆశ్చర్యపడి మాఘమాసమును నీవు చులకనగా చూచుటవలన యెంతటి విపత్తు గటిల్లెనో అనుభవమే చెప్పుచున్నది. నీ వద్దకు వచ్చిన మునిసత్తముడు ఉత్తముడు. అతడు పలికిన విషయములన్నియు యదార్థములే. నీవుకుక్కవై ఎటుల పవిత్రుడవై తివో ఆ వృత్తాంతమును వివరించెదను. సావధానుడవై ఆలకింపుము.

నేను నా శిష్యునితో ఈ మాఘమాసమంతయు కృష్ణవేణీతీరమందుండిన కృష్ణానదిలో మాఘమాసమంతయు స్నానములు - జపములు చేసి తిరిగి మరొకపుణ్యనదికి పోవుదమనివచ్చి యుంటిమి మేమందరము ఈ వృక్షరాజముక్రింద విష్ణువిగ్రహాన్ని పెట్టి పూజించుకొనుచున్నాము కుక్కరూపంలోనున్న నీవు దారినిపోతు ఇచ్చటి నైవేద్యమునుచూసి తినవలయుననెడి ఆశతో పూజసమీపమునకు వచ్చి కూర్చుంటివి. అప్పుడు నీవు ఎలాగున్నావో తెలుసా! నీ శరీరము బురదమైల తగిలివున్నది. చూచుటకు చాలా అసహ్యంగా నున్నావు. పరిశుద్ధులమైభగవంతుని పూజచేయుచున్నసమయములో అచటకు జంతువుగాని, పక్షిగాని, వచ్చియున్న దానిని తరిమివేయుట సహజమే

కదా నీవు అసహ్యంగా వున్నందున శిష్యులు నిన్ను తపోదండముతో తరిమిరి, నైవేద్యము తినవలయుననెడి ఆశతో ఈ మండపం చుట్టుతిరిగి యథాస్థానమునకు వచ్చి కూర్చుంటివి. మరల నా శిష్యులు నిన్ను కొట్ట బోవుటచే తిరిగి మళ్ళీ వచ్చినావు. అట్లు మూడు పర్యాయములు తిరుగుటచే భగవంతుడు నీ రూపమును మార్చి నిజరూపమును ప్రసాదించినాడు. అనగా మాఘమాసఫలము భగవంతుని మండపము చుట్టు తిరుగుటవలన పునర్జన్మ వచ్చినదన్నమాట. ఇక మాఘమాస మంతయూ నదిలో స్నానముజేసి భగవంతుని ధ్యానించి, పురాణ పఠనముజేసినచో ఎంతటిఫలము వచ్చునో ఊహించుకొనుము అని గౌతమఋషి చెప్పగా రాజు మిగుల సంతోషించి గౌతమఋషికి అతని పరివారమంతటికీ నమస్కరించుచుండగా అంతలో ఆ రావి చెట్టులోనున్న ఒక తొఱ్ఱనుండి ఒక మండూకము బైటకువచ్చి, గౌతమ ఋషి పాదములపై బడి బెకబెకమని అరచి, అటుఇటు గెంతుచుండెను. అట్లు గెంతుటలో మండపమువద్దకు వచ్చి కొంచెము చూచుచుండగా హఠాత్తుగా కప్పరూపమును వదలి మునివనితగా మారిపోయెను.

ఆమె నవ యౌవ్వనవతి, అతి సుందరాంగి. ఆమె గౌతమ ఋషినిచూడగానే తనకు జ్ఞానోదయమై పూర్వజన్మ వృత్తాంతమంతయు జ్ఞప్తికి వచ్చినది.

అంత గౌతమముని-అమ్మాయీ! నీ వెవ్వరిదానవు? నీనామధేయమేమి? నీ వృత్తాంతము తెలియజేయుము అని ప్రశ్నించిరి.

గౌతమమునిని చూడగానే తన పూర్వజన్మ వృత్తాంతము తెలియజేయుటచే యిట్లు చెప్పదొడంగెను.

# 17వ అధ్యాయము

## కప్పరూపము వదలిన స్త్రీ తన వృత్తాంతమును చెప్పుట

"మునిశ్రేష్ఠా! నా వృత్తాంతమును తెలియజేయుదును గాన ఆలకింపుము.

నా జన్మస్థానము గోదావరినది సమీపమందున్న ఒక కుగ్రామము, నా తండ్రి పేరు హరిశర్మ. నా పేరు మంజుల. నన్ను నాతండ్రి కావేరీతీర్థవాసియగు జ్ఞానానందుడను వానికిచ్చి పెండ్లి చేసెను. అతడు దైవభక్తుడు, జ్ఞాని, నిగర్వి, మాకు వివాహమైన వెంటనే అతని వెంట కాపురమునకు వెళ్ళినాను. మరికొన్నాళ్ళకు మాఘము ప్రవేశించినది,

ఒకనాడు నాభర్త "సఖీ" మాఘమాసము ప్రవేశించినది. మాఘమాసము చాల పవిత్రమైనది. దీని మహాత్మ్య చాల విలువైనది. నేను నాచిన్నతనమునుండీ ప్రతిసంవత్సరమూ మాఘస్నానములుచేయు చున్నాను. నీవు నాభార్యవు గావున నీవును ఈమాఘమాసమంతయు యీకావేరీనదిలో స్నానమాచరించుము. ప్రతిదినము ప్రాతఃకాలము నిద్రనుండి లేచి కాలకృత్యాలు తీర్చుకొనుసమయమునకు తెల్లవారి సూర్యోదయమగును. సూర్యుడు ఉదయించిన వెంటనే నదికి పొమ్ము నదిలో స్నానంచేయుము ప్రభాతసూర్యునికి నమస్కరించిన తరువాత నదిఒడ్డున విష్ణువుయొక్క చిత్రపటము పెట్టి పువ్వులతోను మంచి గంధము అగరు, ధూపదీపములను వెలిగించి, స్వామికి ఖండశర్కర పటికిబెల్లము నైవేద్యమిచ్చి నమస్కరింపుము. తరువాత తులసితీర్థము లోనికి పుచ్చుకొని తలకు రాసుకొనుము. మన కుటీరమునకు వచ్చి మాఘపురాణమును రోజుకొక అధ్యాయము చొప్పున పఠించుము. దీనివలన నీకు చాలా ఫలము కలుగును. నీ అయిదవతనము చల్లగా వుండును" అని హితబోధ చేసెను.

నేను అతనిమాటలను వినిపించుకోక రుసరుసలాడి అతనిని నీచముగా జూచితిని. నాభర్తచాలా శాంతస్వరూపుడు. అయిననూ నేను హద్దుమీరి మాటలాడుటచే అతనికి కోపమువచ్చి శపించినాడు.

"ఓసీ మూర్ఖురాలా! నాయింటికి వచ్చి నా వంశాన్ని ఉద్ధరిస్తావనుకున్నాను. ఇంత దైవద్వేషివని నాకు తెలియదు. నీవిక నాతో

నుండతగవు మాఘమాస వ్రతము నీకింత నీచంగా కనిపించినదా? సరియే నీపాపము నిన్నే శిక్షించును, గాన నీవు కృష్ణానదీతీరమందున్న రావిచెట్టు తొ్ఱ్రలో మండూకరూపంలో నుందువుగాక'' అని నన్ను శపించెను.

వారి సింహగర్జనకు వణికిపోయితిని. వారి శాపమునకు భయపడిపోతిని వారి రౌద్రాకారమును చూడజాలకపోతిని. నాకు జ్ఞానోదయము కలిగినది నాతప్పు నేను తెలుసుకున్నాను "అన్నా ఎంతటి మూర్ఖత్వముగా ప్రవర్తించితిని'' అని పశ్చాత్తాపముకలిగినది. వెంటనే భర్త పాదములపై బడి రెండు పాదాలు పట్టుకొని "నాకీశాపము ఎట్లు పోవును మరల నిన్నెటుల కలుసుకొందును నాకు ప్రాయశ్చిత్తములేదా అనిపరిపరివిధాల ప్రార్థించగా నాభర్త కొంతతడవాలోచించి ఒకగడువు పెట్టెను. అది ఏమనగా గౌతమమహర్షి గోదావరీ నదీతీరమందున్న తన యాశ్రమమునుండి ఉత్తర దేశయాత్రలు చేయుటకు బయలుదేరి తిరిగి మాఘశుద్ధదశమినాటికి కృష్ణానదీస్నానము చేయుటకు వచ్చెదరు. అలాంటి సమయములో నీవు వారిని దర్శించినయెడల ఆ మహర్షి ప్రభావమువలన నీకు నిజరూపముకలుగును'' అని చెప్పుచుండగా నేను కప్పరూపముదాల్చితిని. నాభర్తకూడా నామూర్ఖత్వమునకు విచారించెను నేను కప్పరూపముతో గెంతుకుంటూ కొన్నిదినాలకు కృష్ణానదీతీరాననున్న ఈరావిచెట్టుతొ్ఱ్రలో నివాసమేర్పరచుకొని జీవించుచూ మీరాకకోసం ఎదురుచూచుచుంటిని. ఇది జరిగి ఎంతకాలమైనదో నాకు తెలియదు'' అని తన వృత్తాంతము గౌతమమునికి తెలియజేసెను

"అమ్మాయీ! భయపడకుము. నీకీశాపము కలిగి వెయ్యేండ్లు పైగా అయినది ఇంతకాలము నీవు అనేకకష్టములుపడి జీవించినావు. నీభర్త యనుపకాంతముగా చాలాకాలముజీవించిహరినామసంకీర్తనలు చేయుచు మృతుడయెను. అతడిప్పుడు వైకుంఠములో వున్నాడు. నీవు తనమాటలు విననందున ఎంతకష్టపడినావో తెలిసినదిగదా! మాఘ

మాసప్రభావం అసామాన్యమైనది. సకలసౌభాగ్యాలు పుత్రసంతతి ఆరోగ్యము కలుగుటయేగాక మోక్షసాధనమైనట్టిదికూడా. దీనికి మించిన మరియొకవ్రతము లేదు. విష్ణుమూర్తికి ప్రియమైనదీ వ్రతము ఇటువంటి వ్రతమాచరింపుమని నీ భర్త యెంత చెప్పినను వినిపించుకొనవైతివి. నీభర్త దూరదృష్టిగలజ్ఞాని. అతని గుణగణాలకు సంతసించెడివారు. నిన్ను పెండ్లియాడినతరువాత తన వంశాభివృద్ధి చేసుకొనవలయుననెడి ఆశతో నుండేవాడు. కాని నీవలన అతనికి ఆశలన్ని నిరాశలయిపోయినవి. నీ మూర్ఖత్వమువలన నీ భర్తకు కోపము కలిగి నిన్ను శపించవలసివచ్చెను? నిన్ను నీళ్ళలో స్నానము చేయమన్నాడు. నీవు చేయనన్నావు. అందులకు నీకు నీరు దొరకకుండా చెట్టుతొఱ్ఱలో జీవించమని శపించినాడు.

ఈ దినము నా సమక్షములో దైవసన్నిధిని పడినందున నీభర్త శాపము ప్రకారము మరల నీ నిజరూపము పొందగలిగినావు. అందునా యిది మాఘమాసము. కృష్ణానదీతీరముకాగా మాఘమాస వ్రత సమయము నీ కన్నివిధాల అనుకూలమైన రోజు. అందుచే నీవు వెంటనే శుచివై రమ్ము. స్త్రీలుగాని, పురుషులుగాని, యీ సమయములో ప్రాతఃకాలమున స్నానము చేసినయెడల విష్ణుసాన్నిధ్యము పొందుదురు. ఎవరయినా తెలిసిగాని, తెలియకగాని మాఘశుద్ధ సప్తమి, దశమి, పౌర్ణమి యందును, పాడ్యమిరోజుననూ నదీస్నానమాచరించినయెడల వారి పాపాలు నశించును. మాఘశుద్ధ పాడ్యమి నాడు స్నానముననూ అటులనే దశమి, ఏకాదశి, ద్వాదశి దినములలో స్నానముచేసి శ్రీమన్నారాయణుని పూజించి, పురాణ కాలక్షేపము చేసినయెడల శ్రీహరి సంతోషించి మనోవాంఛ సిద్ధించునటుల వరమిచ్చును. భక్తిశ్రద్ధలతో మాఘపురాణము వినిన మోక్షప్రాప్తి కలుగును.

అని గౌతమముని ఆ మునివనితతో చెప్పినటుగ మహేశ్వరుడు పార్వతితో ఈ కథ చెప్పెను.

# 18వ అధ్యాయము

## పిసినిగొట్టు వ్యాపారికి మాఘమాస ఫలము కలుగుట.

వశిష్ఠ మహాఋషి దిలీపునకు పార్వతీదేవితో పరమేశ్వరుడు చెప్పిన పిసినారి వృత్తాంతమును యిట్లు తెలియజేసెను.

"పార్వతీ! చాలాకాలం క్రిందట దక్షిణప్రాంతమందలి వసంతవాడయను నామముగల పెద్దపల్లె యుండెను. అందొక బంగారుశెట్టి అను వైశ్యుడొకడు వుండెను. అతని భార్యపేరు తాయారమ్మ. బంగారుశెట్టి వట్టి పిసినిగొట్టు. తనకున్న పిత్రార్జిత సంపదయే లెక్కకు మిక్కుటముగానున్నది. కాని అతడు ఇంకనూ ధనాశకలవాడై తన వద్దనున్న ధనమును వడ్డీలకిచ్చి మరింత సంపన్నుడయ్యెను. కాని ఒక్కనాడైనా హరిని ధ్యానించుటగాని, దానధర్మాలు చేయుటగాని యెరుంగడు. అంతేగాక బీదప్రజలకు వారి ఆస్తులపై వడ్డీలకు ఋణాలిచ్చి అనుకున్న గడువుకు ఋణము తీర్చనందున తప్పుడు సాక్ష్యాలతో వ్యాజ్యములు వేసి వారి ఆస్తులు సైతం స్వాధీనపరుచుకొనేవాడు.

ఒకనాడు బంగారుశెట్టి గ్రామాంతరము వెళ్ళెను. ఆరోజు సాయంత్రం ఒక ముదుసలి బ్రాహ్మణుడు బంగారుశెట్టి భార్యను చూచి "తల్లీ నేను ముసలివాడను నా గ్రామము చేరవలయునన్న ఇంకనూ పది ఆమడలు వెళ్ళనలసియున్నది. ఇప్పుడు చీకటి కాబోతున్నది. ఆకాశంలో మేఘాలు ఉరుముతున్నాయి చల్లగాలికి వణికిపోతున్నాను. మీయింటివద్ద ఈ రాత్రిగడువనియ్యి. నీకెంతైనా పుణ్యముంటుంది. నేను సద్బ్రాహ్మణుడను. సదాచారవ్రతుడను, ప్రాతఃకాలమున మాఘస్నానం చేసి వెళ్ళిపోదును" అని బ్రతిమలాడెను

తాయారమ్మకు జాలి కలిగెను. వెంటనే తన అరుగుమీాల శుభముచేసి అందొక తుంగచాపవేసి కప్పుకొనుటకు వస్త్రమిచ్చి పండుకొనుడని పలికెను. ఆ దయార్ద్రహృదయమునకు ఆ వృద్ధ

బ్రాహ్మణుడు సంతసమంది విశ్రాంతి తీసుకొనుచుండగా తాయారమ్మ ఒక ఫలము ఇచ్చి దానిని భుజించమని చెప్పి ఆర్యా ! మాఘస్నానము చేసివెళ్ళిదను. అని అన్నారుగదా ఆమాఘస్నానమనగానేమి ? దాని వలన కలుగుఫలితమేమి ? సెలవిండు వినుటకు కుతూహలంగా నున్నది. అని యనగా నావృద్ధ బ్రాహ్మణుడు దుప్పటి కప్పుకొని "అమ్మా! మాఘమాసము గురించి చెన్పుటకు నాశక్యముగాదు. ఈ మాఘ మాసములో నదియందుగాని, తటాకమందుగాని, లేక నూతియందు గాని సూర్యోదయము అయిన తరువాత చన్నీళ్ళస్నానముచేసి విష్ణు మందిరానికి వెళ్ళి తులసీదళములతోను, పూలతోను, పండ్లతోను పూజచేసి స్వామివారి ప్రసాదమును స్వీకరించవలెను. తరువాత మాఘపురాణము పఠించవలయును. ఇట్లు ప్రతిదినము విడువకుండా నెల రోజులు చేసి ఆఖరున బ్రాహ్మణునకు సమారాధన, దానములు యివ్వ వలెను. ఇట్లు చేసినయెడల మానవునికున్న రౌరవాది మహాపాపములు వెంటనే నశించిపోవును, ఒకవేళ యీ నెలరోజులూ చేయలేనివారు వృద్ధులు, రోగులు ఒక్కరోజయిననూ అనగా ఏకాదశి రోజునగాని, ద్వాదశినాడుగాని లేక పౌర్ణమి దినమునగాని పై ప్రకారముగా చేసినచో సకలపాపములు వైదొలగి సిరిసంపదలు పుత్రసంతానము కలుగును. ఇది నా అనుభవముతో తెలియజేయుచున్నాను" అని చెప్పగా, ఆ బ్రాహ్మణుని మాటలకు తాయారమ్మ మిక్కిలిసంతసించి తాను ప్రాతఃకాలమున బ్రాహ్మణునితో నదికిపోయి స్నానముచేయు టకు నిశ్చయించుకొనెను.

అంతలో పొరుగూరికి వెళ్ళిన తన భర్తయగు బంగారుశెట్టి ఇంటికివచ్చినాడు. అతడు రాగానే మాఘస్నానము గురించి చెప్పి తాను తెల్లవారుజామున స్నానమునకు పోవుదునని తెలియజేసెను.

భార్యచెప్పినమాటలకు బంగారుశెట్టికి కోపమువచ్చి వంటి నిండా మంటలు బయలుదేరినట్లుగా పళ్ళు పటపట కొరికి ఓసీ వెఱ్ఱి దానా ? ఎవరుచెప్పినారే సిక్కసంగతి ? మాఘమాసమనేమి ? స్నాన

మేమిటి? వ్రతము దానము లేమిటి? నీకేమైన పిచ్చిపట్టినదా? చాలు, చాలు అధిక ప్రసంగము చేసినచో నోరు కొక్కి వేయుదును. డబ్బును సంపాదించుటలో పంచప్రాణాలు పోవుచున్నవి. ఎవరికిని ఒక్క పైసాకూడా వదలకుండా వడ్డీవసూలు చేస్తూ కూడబెట్టిన ధనము దానము చేయమనెదవా? చలిలో చన్నీళ్లు స్నానముచేసి పూజచేసి దానములుచేస్తే వళ్ళూ, ఇల్లూ, గుల్లయి నెత్తిపైన చెంగు వేసుకొని "భిక్షాందేహి" యని అనవలసినదే, జాగ్రత్త! వెళ్ళిపడుకో అని భర్త కోపగించినాడు.

ఆ రాత్రి తాయారమ్మకు నిద్రపట్టలేదు. ఎప్పుడు తెల్లవారునా ఎప్పుడు నదికి వెళ్ళి స్నానముచేతునా? యని ఆత్రుతగా వున్నది. కొన్ని ఘడియలకు తెల్లవారినది. తాను కాలకృత్యములు తీర్చుకొని యింటికి వచ్చియున్న వృద్ధబ్రాహ్మణునితో మగనికి చెప్పకుండ నదికిపోయి స్నానము చేయుచున్నది. ఈలోగా బంగారుశెట్టి పసిగట్టి ఒక దుడ్డుకఱ్ఱ తీసుకొని నదికిపోయి నీళ్ళలోదిగి భార్యను కొట్టబోవు చుండగా ఆ ఇద్దరూ కొంతతడవు నీళ్ళలో పెనుగులాడిరి. అటుల పెనుగులాడుచుండగా ఇద్దరూ నీళ్ళలో మునగవలసివచ్చెను. అటుల మునుగుటచే యిద్దరికీ మాఘమాస ఫలము దక్కినది భార్యను కొట్టి ఇంటికి తీసుకువచ్చినాడు.

కొని సంవత్సరములు జరిగిన తరువాత ఒకనాడు ఇద్దరకు ఒక వ్యాధి సోకినది మరికొన్ని రోజులకు యిద్దరూ చనిపోవుటచే బంగారుశెట్టిని తీసుకు పోవుటకు యమభటులు వచ్చి కాలపాశము వేసి తీసుకొనిపోవుచుండిరి. తాయారమ్మను తీసుకొనిపోవుటకు విష్ణుదూతలు వచ్చి ఆమెను రథముపై ఎక్కించుకొని తీసుకొనిపోవుచుండిరి. అపుడు తాయారమ్మ యమభటులతో యిట్లు పలికెను.

ఓ యమభటులారా? ఏమిటి అన్యాయము? నన్ను వైకుంఠమునకు తీసుకుపోవుట యేమిటి? నా భర్తను యమలోకమునకు తీసుకు పోవుట ఏమిటి? ఇద్దరమూ మాఘస్నానము చేసితిమి కదా!" అని వారినుద్దేశించి

అడుగగా, " ఓయమ్మా! నీవు మాఘమాసములో నొక దినమున స్నానము చేసితివి' అదియు నావృద్ధబ్రాహ్మణునివలన విని స్నానము చేయగా నీకీ ఫలం దక్కినది. కాని నీభర్త అనేకులను హింసించి, అన్యాయముగా ధనార్జన చేసి, అనేకులవద్ద అసత్యములాడి; నరక మన్న భయంలేక భగవంతునిపై భక్తిలేక వ్యవహరించినందున నే యమలోకమునకు తీసుకొనిపోవుచున్నాము'' అని యమభటులుపలికిరి.

ఆమె మరల వారినిట్లు ప్రశ్నించెను. నేను ఒకే ఒక దినమున స్నానము చేసినందున పుణ్యఫలం కలిగినప్పుడు నన్ను కొట్టుచు నాతో నాభర్తకూడ నీటమునిగినాడుకదా! శిక్షించుటలో యింత వ్యత్యాసమేల కలిగెను?, అని అనగా— ఆ యమభటులకు సంశయము కలిగి ఏమియు తోచక చిత్రగుప్తుని వద్దకు వెళ్ళి జరిగిన సంగతి ఆమె వేసిన ప్రశ్నయు తెలియజేసిరి.

చిత్రగుప్తుడును వారి పాపపుణ్యముల పట్టికచూడగా ఇద్దరకూ సమానమైన పుణ్యఫలము వ్రాసియున్నది. జరిగిన పొరపాటునకుచిత్రగుప్తుడు విచారించి బంగారుశెట్టినికూడ వైకుంఠమునకు తీసుకొని పొమ్మని విష్ణుదూతలతో చెప్పెను.

విష్ణులోకమునకు ముందుగా వెళ్ళియున్న తాయారమ్మ తన భర్తగతి ఏమయ్యెనో యని ఆతురతతో వుండగా బంగారుశెట్టిని పుష్పకవిమానముమీద తెచ్చి వైకుంఠములో విడిచిరి. భార్యాభర్తలిద్దరూ మిక్కిలి సంతసమందిరి.

రాజా వింటివా! భార్యవలన భర్తకుకూడ యెటుల మోక్షం కలిగెనో? భర్త దుర్మార్గుడై పిసినిగొట్టుగా వ్యవహరించిననూ భార్య యదాలాపంగా ఒక్కరోజు మాఘస్నానం చేసినందున ఇద్దరికీ వైకుంఠప్రాప్తి కలిగినదికదా! గనుక మాఘస్నానము నెలరోజులు చేసినచో మరింత మోక్షదాయకమగునటలో సందేహంలేదు

# 19వ అధ్యాయము

## ఏకాదశీ మహాత్మ్యము

సంవత్సరములో వచ్చు పండ్రెండు మాసములలోను మాఘమాసం అతిప్రశస్తమైనది. అటువంటి మాఘమాసములో నదిలో గాని, నదిలేనిచోట తటాకమందుగాని, తటాకంకూడ అందుబాటులో లేనియెడల నూతిదగ్గరకాని, స్నానం చేసినంతమాత్రముననే మానవుడు తాను చేసిన పాపములన్నియు హరించిపోవును.

పూర్వము అనంతుడను విప్రపుంగవుడు యమునా నదీతీరమునందున్న యగ్రహారంలో నివశించుచుండెను. ఆతని పూర్వీకులందరూ గొప్ప జ్ఞానవంతులు, తపశ్శాలురు, దానధర్మములు చేసి కీర్తిపొంది యున్నారు

అతడు చిన్నతనమునుండీ గడసరి, పెంకివాడు, అతను తల్లిదండ్రుల భయభక్తులవలన కొంతవరకు మాత్రమే విద్యనేర్చుకొనెను. దుష్టసహవాసములు చేసి అనేక దుర్గుణములు కలవాడయ్యెను. మద్యమాంసములు సేవించి కన్నబిడ్డలను కూడా అమ్ముకొనుచుండెను అలా సంపాదించి ధనవంతుడయ్యెను. కొంతకాలానికి వృద్ధుడయ్యెను. తనకున్న ధనంతో తాను తినడు ఇతరులకు పెట్టడు. ఒకనాటి రాత్రి పరుండబోవునపుడిట్లు ఆలోచించెను. అయ్యో! నేనెంతటి పాపాత్ముడనైతిని! ధనము శరీరబలము ఉన్నదను ఘనోగర్వముతో జీవితాంతమూ ముక్తినిచ్చే పుణ్యకార్యమొక్కటియు చేయలేకపోయినాను గదా యని పశ్చాత్తాపము నొందుతూ నిద్రపోయెను. అన్నిరోజులు ఒకే విధముగా నుండవుగదా! ఆనాటి రాత్రి కొందరు చోరులు అనంతుని యింటిలో ప్రవేశించి ధనం, బంగారం మెత్తుకొనిపోయిరి.

అనంతుడు నిద్రనుండి లేచిచూడగా, సంపదంతా అపహరింపబడినది. అన్యాయంగా ఆర్జించిన ధనము అన్యాక్రాంతము అయ్యెనని రోదన చేసినాడు. ఆ సమయమున పెద్దల నీతులు జ్ఞప్తికి

వచ్చినవి. తాను చేసిన పాపములకు ప్రాయశ్చిత్తము కోరసాగెను. ఆ సమయముననే మాఘమాసము నడుచుచున్నందున యమునానదికి వెళ్ళి స్నానమాడెను. అందువలన అతనికి మాఘమాస స్నానఫలము దక్కెను. నదిలో మునిగి తడిబట్టలతో ఒడ్డుకువచ్చెను. చలికి గడగడ వణికి, బిఱ్ఱబిగిసిపోయినాడు, "నారాయణా" అని ప్రాణాలు విడిచినాడు. ఆ ఒక్కదినమైనను నదిలో స్నానము చేయుటవలన తాను చేసియున్న పాపములన్నీ నశించిపోయి వైకుంఠవాసుడయ్యెను" అని వశిష్ఠుడు తెలియజేసెను.

# 20 వ అధ్యాయం

## భీముడు ఏకాదశి వ్రతము చేయుట

పాండవులలో ద్వితీయుడు భీముడు. అతడు మహాబలుడు. భోజనప్రియుడు. ఆకలికి ఏమాత్రము ఆగనివాడు. బాడెడన్నము అయినను చాలదు. అటువంటి భీమునకు ఏకాదశీవ్రతము చేయవలయునని కుతూహలము పుట్టెను. కాని ఒక విషయములో బెంగతో వుండెను. అదేమందువా? ఏకాదశినాడు భోజనము చేయకూడదు. కదా! భోజనము చేసిన ఫలము దక్కదుకదా! అని విచారించి తమ పురోహితుని వద్దకుపోయి 'ఓయీ పురోహితుడా! అన్ని దినముల కంటె ఏకాదశి పరమపుణ్యదినమని అనెదరుగదా! దాని విశిష్టత యేమి అని భీముడు అడిగెను

"అవును భీమసేనా! ఆ రోజు అన్ని దినములకంటెను ప్రశస్తమయినది. శ్రీమహావిష్ణువునకు ప్రీతికరమైనది. గనుక అన్ని జాతుల వారును ఏకాదశీవ్రతము చేయవచ్చును."అని పాండవ పురోహితుడగు ధౌమ్యుడు పలికెను.

"సరే నేను అటులనే చేయుదును గాని విప్రోత్తమా! నేను భోజనప్రియుడనన్న సంగతి జగద్విదితమేకదా! ఒక గడియ ఆలస్యమైన నేను ఆకలికి తాళజాలను గనుక, ఏకాదశినాడు ఉపవాసముండుట ఎటులని విచారించుచున్నాను. ఉపవాసమున్న దినమున నాకు ఆకలి ఎక్కువగా

వుండును. గనుక ఆకలి తీరులాగున ఏకాదశీ వ్రతఫలము దక్కులాగున నాకు వివరింపుము అని భీముడు పలికెను.

భీమసేనుని పలుకులకు ధౌమ్యుడు చిరునవ్వునవ్వి "రాజా! ఏకాదశీవ్రతమునకు దీక్ష అవసరము. దీక్షతో ఏ కార్యము చేసిననూ కష్టములు కనిపించవు. గాన నీవు దీక్షబూనినచో ఆకలి కలుగదు. రాబోవు ఏకాదశీ అనగా మాఘశుద్ధ ఏకాదశీ మహాశ్రేష్టమయినది. దానికిమించిన పర్వదినము మరియొకటి లేదు. ఒక్కొక్కసమయంలో మాఘ ఏకాదశీరోజు పుష్యమీనక్షత్రముతో కూడినదై యుండును. అటువంటి ఏకాదశికి సమానమగునది మరి ఏదియు లేదు. సంవత్సరమునందు వచ్చు ఇరువదినాల్గు ఏకాదశులలో మాఘశుద్ధ ఏకాదశి మహాపర్వదినము గాన ఆ దినము ఏకాదశీవ్రతము చేసిన గొప్పఫలితము కలుగును. ఇందు ఏమాత్రము సంశయము లేదు. గాన ఓ భీమసేనా! నీవు తప్పక మాఘశుద్ధ ఏకాదశీవ్రతము ఆచరింపుము. ఆకలి గురించి దిగులుపడకుము. దీక్షతో నున్నయెడల ఆకలి ఏమాత్రమూ కలుగదు. 'నియమము' తప్పకూడదు. అని ధౌమ్యుడు భీమునకు వివరించెను.

ధౌమ్యునివలన తన సంశయము నెరవేరుటకు మాఘ శుద్ధ ఏకాదశినాడు అతినిష్టతో వ్రతముచేసి ఉపవాసముండెను. అందులకే మాఘ శుద్ధ ఏకాదశి "భీమ ఏకాదశి "అని పిలుతురు. అంతియేగాక ఓ దిలీప మహారాజా! పరమేశ్వరునకు, అత్యంత ప్రీతికరమగు శివరాత్రికూడ మాఘమాసమందే వచ్చును. గాన మహాశివరాత్రి మాహాత్మ్యమును గురించికూడ వివరించెదను. శ్రద్ధాళుడవై ఆలకింపుము" అని వశిష్టులవారు దిలీపమహారాజుతో ఇటుల పలికిరి.

## శివరాత్రి మహాత్మ్యము

ఏకాదశి మహావిష్ణువునకు ఎటుల ప్రీతికరమైన దినమో అదే విధంగా మాఘచతుర్దశీ అనగా శివచతుర్దశి- దీనినే 'శివరాత్రి' యని అందురు. ఈశ్వరునికి అత్యంత ప్రీతివంతమయిన ఇది మాఘ మాసమునందు వచ్చు అమావాస్యకు ముందురోజు. దానినే "మహాశివ

రాత్రి" యని అందరూ పిలిచెదరు. ఇది మాఘమాసంలో కృష్ణపక్ష చతుర్దశినాడు వచ్చును. ప్రతిమాసమందువచ్చు మాసశివరాత్రికన్న మాఘమాస కృష్ణపక్షంలో వచ్చు మహాశివరాత్రి పరమేశ్వరునికి అత్యంత ప్రీతికరమైనది. ఆరోజు నదిలోగాని, తటాకమందుగాని లేక నూతివద్దగాని స్నానముచేసి శంకరుని పూజించవలెను. పరమేశ్వరుని అష్టోత్తర శతనామావళీ బిల్వపత్రములతో పూజించవలయును. అటుల పూజించి. శివప్రసాదము సేవించి, ఆ రాత్రి అంతయు తప్పనిసరిగా జాగరణమువుండి మరునాడు అమావాస్య స్నానంకూడా చేసిన యెడల ఎంతటి పాపములు కలిగివున్ననూ, అవన్నియు వెంటనే హరించుకుపోయి, కైలాసప్రాప్తి కలుగును. శివపూజా విధానములో శివరాత్రికంటె మించినది మరియొకటిలేదు. గనుక మాఘమాసము కృష్ణపక్షములోవచ్చు చతుర్దశి ఉమాపతికి అత్యంత ప్రీతిపాత్రమైనది. గాన శివరాత్రిదినమున ప్రతివారూ అనగా జాతిభేదములతో నిమిత్తం లేక అందరూ శివరాత్రివ్రత మాచరించి జాగరణ చేయవలయును.

"మున్ను శబరి నదీతీరమునందున్న అరణ్యములో కులీనుడను బోయవాడు తన భార్యాబిడ్డలతో నివసించుచుండెను. తనకు వేటతప్ప మరొక ఆలోచన లేదు. కడుమూర్ఖుడు. వేటకు పోవుట, జంతువులను చంపి, వాటిని కాల్చి తాను తిని, తన భార్యాబిడ్డలకు తినిపించుటతప్ప మరేదియు తెలియదు. జంతువులను వేటాడుటలో నేర్పుగలవాడు. క్రూరమృగములు సహితం బోయవానినిచూచి భయపడి పారిపోయెడివి. అందుచేత అతడు వనమంతా నిర్భయంగా తిరిగేవాడు.

ఒకనాడు ప్రతిదినము వేటకు వెళ్ళునట్లే బయలుదేరి వెళ్ళెను. ఆనాడు జంతువులేమియు కంటపడలేదు. సాయంకాలమగుచున్నది. వట్టిచేతులతో ఇంటికి వెళ్ళుటకు మనస్సంగీకరించనందున పొద్దుగుంకి పోయిననూ అక్కడున్న మారేడు చెట్టుపై కెక్కి, జంతువులకొఱకు యెదురుచూచుచుండెను. తెల్లవారుతున్నకొలది చలియెక్కువగుచు మంచు కురుస్తున్ననూ కొమ్మలను దగ్గరకులాగి వాటితో తన శరీరాన్ని కప్పుకొనుచుండెను. ఆకొమ్మలనున్న మారేడాకులు రాలి

చెట్టుక్రిందవున్న శివలింగముమీద పడినవి. ఆరోజు మహాశివరాత్రి అందులో బోయవాడు రాత్రంతట తిండితినక జాగరణతో వున్నాడు. తనకు తెలియకపోయిననూ మారేడుపత్రములు శివలింగముపై పడినవి. ఇంకేమున్నది ? శివరాత్రి మహిమ బోయవానికి సంప్రాప్తించెను. మాఘమాసములో కృష్ణపక్ష చతుర్దశిరాత్రి అంతయు జాగరణ, పైగా శివలింగముపై బిల్వపత్రములు పడుట తిండిలేక ఉపవాసము వుండుట ఇవన్ని ఆబోయవానికి మేలుచేసినవి.

జరామరణములకు హెచ్చుతగ్గులుగాని, శిశువృద్ధులుగాని లేవు. పూర్వజన్మలో చేసుతున్న పాపపుణ్యములనుబట్టి మనుజుడు తన జీవితమును గడపవలసినదే.

మరికొన్ని సంవత్సరములకు ఆ బోయవానికి వృద్ధాప్యముకలిగి మరణమాసన్నమై ప్రాణములు విడిచెను. వెంటనే యమభటులొచ్చి వాని ప్రాణములు తీసుకుపోవుచుండగా కైలాసమునుండి శివదూతలు వచ్చి యమదూతల చేతిలోనున్న బోయవాని జీవాత్మను తీసుకొని శివునిదగ్గరకు పోయిరి. యమభటులు చేయునదిలేక యమునితో చెప్పిరి. యముడు కొంతతడవు ఆలోచించి శివుసన్నిధికు వెళ్ళెను.

శివుడు పార్వతి, గణపతి, కుమారస్వామి, నంది, తుంబుర నారదాది గణములతో కొలువుతీర్చివున్న సమయములో యముడు వచ్చి శివునకు నమస్కరించాడు ఉమాపతి యముని దీవించి ఉచితాసనమిచ్చి కుశలప్రశ్నలడిగి వచ్చిన కారణమేమని ప్రశ్నించెను.

అంతట యముడు మహేశా ! చాల దినములకు మీ దర్శన భాగ్యం కలిగినందుకు మిక్కిలి ఆనందించుచున్నాను. నా రాకకు కారణమేమనగా, ఇంతకుముందు మీదూతలు తీసుకవచ్చిన బోయవాడు మహాపాపి, క్రూరుడు దయాదాక్షిణ్యాలు లేక అనేక జీవహింసలు చేయుచున్నాడు ఒక దినమున అనగా మహాశివరాత్రినాడు తాను యాదృచ్ఛికముగా జంతువులు దొరకనందున తిండితినలేదు. ఆ రాత్రి చలిబాధను తట్టుకొనలేక బిల్వపత్రములను కప్పుకొన్నాడు. జంతువులను వేటాడుటకు రాత్రి అంతయు మేలుకువగా వున్నాడు. కాని

చిత్తశుద్ధితో తాను శివలింగమును పూజించలేదు. గనుక అతనిని కైలాసమునకు తీసుకొనివచ్చుట భావ్యమా? అంతమాత్రమున అతనికి కైవల్యము దొరుకునా!'' అని యముడు విన్నవించుకున్నాడు.

యమధర్మరాజా! ప్రీతికరమైన మహాశివరాత్రి పర్వదినమున బిల్వపత్రములు నాపైనవేసి, తిండిలేక జాగరణతో నున్న యీబోయవాడుకూడ పాపవిముక్తుడు కాగలడు. ఈ బోయవానికి కూడ ఆ వ్రతఫలం దక్కవలసినదే గనుక ఈ బోయవాడు పాపాత్ముడయినను, ఆనాటి శివరాత్రి వ్రతమహిమవలన నా సాయుజ్యము ప్రాప్తమయినది. అని పరమేశ్వరుడు యమునికి వివరించెను. యముడు చేయునదిలేక చంద్రశేఖరుని వద్దనుండి వెడలిపోయెను.

# 21వ అధ్యాయము

## దత్తాత్రేయుడు కార్తవీర్యార్జునునకు ఉపదేశమిచ్చుట.

దత్తాత్రేయుడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులయొక్క అంశమున జన్మించినవాడు, అతడుకూడ లోకకళ్యాణముకొరకు ఘనకార్యములు చేసినాడు. త్రిమూర్తులు దత్తాత్రేయుని రూపమున జన్మించివున్నారు.

దత్తాత్రేయుని కాలములో కార్తవీర్యార్జునుడను క్షత్రియ వీరుడు మాహిష్మతియను నగరమును రాజధానిగా జేసుకొని పాలించుచుండెను. అతనికి గురువర్యులు దత్తాత్రేయుడు. ఒకనాడు దత్తాత్రేయుని యాశ్రమమునకు కార్తవీర్యార్జునుడు వెళ్ళి నమస్కరించి "గురువర్యా మీఅనుగ్రహమువలన అనేక విషయాలు తెలిసికొనివుంటిని. మాఘ మాసముయొక్క మాహాత్మ్యమును వినియుండలేదు. గాన మాఘ మాసముయొక్క విశిష్టతనుగురించి, మాఘస్నాన ఫలముగుర్చించి నాకు వివరించవలసినదిగా కోరుచున్నాను'' అని దత్తాత్రేయునికోరెను. దత్తాత్రేయుడు కార్తవీర్యార్జునుని కోరికను మన్నించి ఈవిధముగా వివరించిరి.

"భూపాలా! భరతఖండమునందున్న పుణ్యనదులకు సమానమైన నదులు ప్రపంచమందెచ్చటనూ లేవు. ఈ నదులలో ముఖ్య

మైనవి పండ్రెండు. అందుచేతనే వీటికి. పుష్కరప్రవేశము కలుగు చున్నది. బృహస్పతి ఒక్కొక్క సంవత్సరము ఒక్కొక్క రాశియందున్నప్పుడు ఆయానదులకు పుష్కరారంభమగును గనుక అటువంటి నదులయందు స్నానముచేసి దానపుణ్యము లాచరించిన యెడల దాని వలన కలుగు ఫలమును వర్ణించుట నాకుకూడ సాధ్యము కాదు. అందునూ మాఘమాసమందు నదిలో స్నానముచేసిన గొప్పఫలితం కలుగుటయేగాక జన్మరాహిత్యము కలుగును. గనుక ఏమానవుడైననూ మాఘమాసములో నదీస్నానము తప్పకుండ చేయవలెను. అటుల చేయని యెడల ఆ మనుజుడు జన్మజన్మలందు తాను చేసుకున్న పాపఫలము అనుభవించక తప్పదు.

మాఘమాసములో సూర్యుడు మకరరాశియందుండగా మాఘ స్నానములుచేసి, ఒక సద్బ్రాహ్మణునకు దానధర్మములు చేసినచో పంచమహాపాతకములు చేసినవాడైననూ ముక్తినొందగలడు. అని దత్తాత్రేయుడు కార్తవీర్యార్జునునకు ఈ విధముగా చెప్పుచున్నారు.

పూర్వకాలమున గంగానదీతీరమున ఉత్తరభాగమున భాగ్యపురమను పట్టణము గలదు. అందు నివసించుజనులు భాగ్యవంతులు, గొప్ప వ్యాపారములుచేసి ధనము సంపాదించి అపర కుబేరునివలె నున్నారు. ఆ నగరములో హేమాంబరుడను వైశ్యుడు గలడు. అతడును గొప్పధనవంతుడు. బంగారునగలు, నాణెములు రాసుల కొలదీ ఉన్నవాడు.

మరికొంతకాలమునకు హేమాంబరుడు చనిపోయెను. తండ్రి చనిపోగానే ఇద్దరన్నదమ్ములు తండ్రిఆస్తిని భాగములువేసి పంచుకొని ఇష్టమొచ్చినటుల పాడుచేయుచుండిరి. ఇద్దరూ చెరొక ఉంపుడు కత్తెను చేరదీసి కులభ్రష్టులయి ఉండిరి. ఒకనాడు పెద్దకుమారుడు దైవవశమున అడవిలో పెద్దపులి నోటబడి చనిపోయినాడు. చిన్న కుమారుడు వేశ్యతో ఉద్యానవనములో విహరించుచుండగా కర్మవశాత్తు త్రాచుపాము కరచుటచే ఆతని ప్రాణములు గాలిలో కలసిపోయెను. గనుక మా

చనిపోయినాడు. ఆ విధముగా హేమాంబరుని కుమారులిద్దరూ చనిపోయినారు.

యమదూతలు వచ్చి వారిద్దరినీ యమలోకమునకు తీసుకొని వెళ్ళిరి. చిత్రగుప్తుడు వారి జాబితాలు చూసి పెద్దవానిని నరకంలో పడవేయమన్నాడు. రెండవవానిని స్వర్గలోకమునకు పంపించమన్నాడు. అప్పుడా చిన్నవాడు చిత్రగుప్తునితో ఇట్లు అన్నాడు.

అయ్యా, మేమిద్దరము ఒకే తండ్రి బిడ్డలము. ఇద్దరమూ ఒక విధముగానే పాపములు చేసియున్నాము. అయినా అతనికి నరకమేల నాకు స్వర్గమేల ప్రాప్తించును !" అని అడిగెను. ఆ మాటకు చిత్రగుప్తుడు ఓయీ, వైశ్యపుత్రా ! నీవు నీ మిత్రుని కలుసుకొనుటకు ప్రతీదినము గంగానదిని దాటి ఆవలగట్టునున్న నీ స్నేహితునితో సంభాషించి వచ్చుచుండెడివాడవు. అటులనే మాఘమాసములో నదిని దాటుచుండగా, కెరటాలజల్లులు నీ శిరస్సుపై పడినవి. అందువలన నీవు పవిత్రుడవైనావు. మరొకవిషయ మేమనగా - నీ మిత్రుడు బ్రాహ్మణుడు. ప్రతినిత్యము బ్రాహ్మణదర్శనము చేసిన చో గోహత్యాది మహాపాతకములు కూడ నశించును. గాన విప్రుని చూచుటవలన నీకు మంచి ఫలితమే కలిగినది. అదియునుగాక, ఆ బ్రాహ్మణుడు పఠించు గాయత్రీమంత్రమునుకూడ నీవు వినియున్నావు. గంగానదిలోని నీరు నీ శరీరంమీద పడినది గనుక నీ పాపములు నశించినందున నిన్ను స్వర్గానికి పంపుచున్నాను. అని చిత్రగుప్తుడు వివరించెను.

"ఆహా ! ఏమి నాభాగ్యం ! గంగాజలము నామీద పడనంత మాత్రముననే నాకింతటి మోక్షము కలిగినదా" అని వైశ్యకుమారుడు సంతసించి దేవతలతో స్వర్గలోకమునకు వెళ్ళిపోయెను.

# 22వ అధ్యాయము

## గంగాజల మాహాత్మ్యము

ఓ కార్తవీర్యార్జునా ! శివపూజ గురించి, శివమహాత్మ్యమును గురించి వివరించెను. పిమ్మట మున్ను శ్రీరామచంద్రుడు రావణుని

చంపుటకు సముద్రముపై వారధికట్టినచోట శివలింగమును ప్రతిష్ఠించి శివుని ధ్యానించి వారధినిదాటి రావణుని చంపెను. అటులనే హనుమంతుడు సముద్రమును దాటునపుడు శివుని ధ్యానించి, రామునికి నమస్కరించి మహాబలమును సంపాదించి సముద్రమును దాటెను. అర్జునుడు యుద్ధమునకు బయలుదేరేముందు శివపూజచేసి యుద్ధరంగములో ప్రవేశించాడు. ఇంకెందరో మహానుభావులు శివుని ధ్యానించి తమకు జయమును చేకూర్చుకొనిరి స్త్రీలు తమ మనోవాంఛను ఈడేర్చుకొనిరి. గనుక పూజలందు శివపూజ పవిత్రమైనది. అటులనే నదులలో గంగానది పరమపవిత్రమైనది. ఎటులనగా గంగాజలం విష్ణు పాదములనుండి పుట్టినదియు, శివుని శిరస్సునుండి ప్రవహించునట్టియు అయినందుననే సర్వపాపరహితమైనది. గంగాజలములో స్నానము చేసినచో మహాపాపములు సైతం హరించిపోవును. గాన గంగాజలమునకు అంత ప్రాముఖ్యత వున్నది. ఇంకనూ గంగాజలము గురించి చెప్పబోవునది యేమనగా ఏ నదిలోగాని, సెలయేరులోగాని, చెరువుందుగాని స్నానము చేయునపుడు 'గంగ గంగ గంగ !' అని మూడు పర్యాయములు అనుకొని శిరస్సున నీళ్ళు చల్లుకొనినచో అది గంగాజలముతో సమానమయినదగును,

గంగాజలము విష్ణుమూర్తి ప్రతిరూపము గనుక గంగాజలముతో సాటియగు జలము ఈ ప్రపంచమునందెచ్చటనూ లేదు. అని గంగాజలమునుగురించి కార్తవీర్యార్జునునకు దత్తాత్రేయుడువివరించెను

## 23వ అధ్యాయము

### బ్రాహ్మణ కన్యల విమోచనము

కొంతకాలం క్రిందట మగధరాజ్యములో పురోహితవృత్తిచే జీవించుచున్న నలుగురు బ్రాహ్మణులుండిరి. నల్గురకు నల్గురుకుమార్తెలుండిరి వారు నిండుయవ్వనవతులై ఉండిరి. కొన్నాళ్ళకు ఆ గ్రామపు కోనేటిలో స్నానంచేయుటకొక గురుకులవిద్యార్థి వచ్చెను బ్రాహ్మణ కన్యలు ఆ యువకుని అందముచూచి మోహించి అతనిని సమీపించి

చుట్టుముట్టి తమ్ము వివాహము చేసుకోమని బలవంతము చేయు-ఆ బ్రాహ్మణ విద్యార్థికీ విద్యపూర్తి కానందున వారికోర్కె-నిరాకరించెను. అంత నా కన్యలు కోపంతో "నీవు పిశాచివి కమ్మని" శపించగా ఆ విద్యార్థియూ "మీరుకూడ పిశాచులగుదురుగాక" యని ప్రతిశాప మిచ్చుటచే వారంతా పిశాచ రూపములతో ఆ కొలనువద్దనే వుండి అందరినీ బాధించి, ఆహారము దొరికితే పెనుగులాడుచుండిరి.

కొంత కాలమునకు ఒక సిద్ధుడాకోనేటి దగ్గరకురాగా నాపిశాచ ముల తల్లిదండ్రులు తమ బిడ్డలకు కలిగిన పిశాచరూపం లెట్లు పోవు నని అడిగిరి. ఆసిద్ధుడు "వీరందరిచేత మాఘమాసంలో గయలోనున్న త్రివేణిలో స్నానము చేయించినచో వారికున్న పిశాచరూపం తొలగి పోవును" అని చెప్పగా వారట్లు చేయుటచే ఆ నలుగురకూ యథా రూపములు కలిగినవి. అట్లు జరుగుట మాఘస్నానమే కారణము.

# 24వ అధ్యాయము

## విశ్వామిత్రునికి వానరముఖము కలుగుట-శూద్ర స్త్రీ వృత్తాంతము

మాఘమాసమందలి నదీస్నానము మనుజులకే కాక దేవతలకు గంధర్వులకు కూడ పరమపవిత్రమైనది.

ఒక మాఘమాసంలో నొక్క గంధర్వుడు తన భార్యతో భూలో కానికివచ్చి గంగానదిలో స్నానమాడెను. తన భార్యమాత్రం స్నాన మాచరించనని చెప్పుటచే ఆమె దేవత్వము నశించి గంధర్వలోకానికి వెళ్ళలేక వుండిపోయినది. ఆమెను విడిచిపెట్టి ఆగంధర్వుడొక్కడే వెళ్ళి పోయాడు. ఆమె అడవిలో తిరుగుతూ విశ్వామిత్రుడు ఉన్నచోటుకు వెళ్ళి వయ్యారంగా క్రీగంటచూచెను, ఆమె అందము యౌవ్వనానికి విశ్వామిత్రుడు తన్మయుడై ఆమెను ప్రేమించుటచే ఇద్దరూ కామక్రీడ లతో తేలియాడుచుండగామరలనాగంధర్వుడుభార్యను వెదుకుకొనుచూ వచ్చిచూడగా విశ్వామిత్రుడు, గంధర్వస్త్రీ క్రీడించుచుండిరి. ఆదృశ్య మును చూచి మండిపడుచూ నీవు పశువువలె యుండి కామతృష్ణగల

వాడవై తిని గాన నీకు కోతిముఖము సంభవించుగాక యని విశ్వా మిత్రుణ్ణి-" "ఓసీ కులటా! నీవు పాషాణమై పడివుండు"మని భార్యను శపించి వెళ్ళిపోయినాడు. విశ్వామిత్రుడు చేయునది లేక వానరముఖము కలిగివుండగా నారదుడు ఈ విషయము తెలిసికొని విశ్వామిత్రుని కడకు వచ్చి "విశ్వామిత్రా! క్షణభంగుకరమైన తుచ్ఛ కాము వాంఛకు లోనై నీ తపశ్శక్తినంతా వదులుకున్నావు. సరే లెమ్ము. గంగానదిలో స్నానముచేసి నీ కమండలముతో గంగాజలము తెచ్చి ఈపాషాణముపై చల్లుము. అని నారదుడు వివరించగా విశ్వామిత్రుడు గంగానదిలో స్నానముచేసి విష్ణువును ధ్యానించి. కమండలంతో నీరు తెచ్చి పాషాణంగామారిన గంధర్వస్త్రీపై చల్లెను. ఆ స్త్రీ నారదునికి నమస్కరించి గంధర్వ లోకమునకు వెళ్ళిపోయెను. విశ్వామిత్రుడు తపస్సుకు వెళ్ళిపోయినాడు.

# 25వ అధ్యాయము

## సులక్షణ మహారాజు వృత్తాంతము

వంగదేశమును సూర్యవంశపు రాజగు సులక్షణ మహారాజు పరిపాలించుచుండెను. అతనికి నూర్గురు భార్యలుగలరు. అతడు గొప్ప ధైర్యవంతుడు, బలవంతుడు, ధర్మపాలకుడు. తన దేశప్రజల కేయాపద వచ్చిననూ తనదిగా భావించి తన్నివారణోపాయం చేసెడివాడు.

సులక్షణ మహారాజెంతటి రాజాధిరాజైననూ యెంతటి తరగని సంపత్తికలవాడైననేమిలాభం? "అపుత్రస్యగతిర్నాస్తి" అనునటుల పుత్రసంతానము లేకపోవుటచే తనకు గతులులేవు కదా! కాగా తన వంశము ఎటుల అభివృద్ధి చెందును? తనతో తన వంశము అంతరించి పోవలసినదేనా ? అని దిగులు చెందుచుండెను.

ఒకనాడు తాను తన రథమెక్కి నైమిశారణ్యమున గొప్ప తపశ్శాలురున్న ప్రదేశమునకు వెళ్ళెను. అచట తపోధనులందరూ

తపస్సు చేసుకొనుచుండిరి. వారికి సులక్షణ మహారాజు నమస్కరించి యిటుల పలికెను.

"మునిశ్రేష్ఠులారా! నేను వంగ దేశాధీశుడను. నా పేరు సులక్షణు డందురు. నాకు నూర్గురు భార్యలు. అయిననేమి? ఒక్క సంతాన మైననూ కలుగ లేదు. గాన నాకు పుత్రసంతానము కలుగునట్లొనరింపుడు" అని అంజలి ఘటించి ప్రార్థించాడు. మహారాజు పలుకులకు ముని శ్రేష్ఠులు విని జాలినొందిరి "రాజా! నీవు సంతానహీనుడ వగుటకు కారణ మేమనగా - పూర్వజన్మలో నీవు సౌరాష్ట్రమును పాలించి యుంటివి. ఆ జన్మలో ఒక్క మాఘమాసస్నానమైనా చేయలేదు. ఒక్క దానమైననూ ఇవ్వలేదు. ఒక బ్రాహ్మణునకు గుమ్మడికాయ నైనా దానం చేసియున్నచో ఈజన్మలో పుత్రసంతతి కలిగివుండేది. గాన వెనుక కర్మఫలంవలననే నీ కీ జన్మలో పుత్రసంతతి కలుగలేదు. ఎవరు మాఘమాసములో శుద్ధసప్తమిరోజున కుష్మాండదానము చేయుదురో వారికి తప్పక పుత్రసంతానము కలుగగలదు. ఇందుకు సందేహ మేమియు లేదు" అని చెప్పి ఒక ఫలమును మంత్రించి రాజునకిచ్చి "దీనిని నీ భార్యలచే భుజింపచేయుము" అని పలికిరి. మహాభాగ్యం అని ఫలమును కండ్లకద్దుకొని యింటికి వెళ్ళిపోయినాడు.

భర్తరాక విని పట్టమహిషులు ఎదురేగి మంగళహారతులిచ్చి సేవ దీర్చిరి. రాజు తెచ్చిన మంత్రఫలంగురించి వివరించి "భోజనానం తరం సేవింపుడు" అని చెప్పి తన గదియందు ఫలమును భద్రపరచి తాను భోజనసాలకు పత్నులతో వెడలిపోయెను. నూర్గురు భార్యలలో కడ భార్యకు మిక్కిలి ఆశకలిగి ఫలమంతయు నేనే భుజించెదనని తల పోసి, రహస్యమార్గమున రాజు పడకగదిలోకి వెళ్ళి ఆఫలమును భుజించి ఏమియు ఎరుగనిదానివలె అందరితో కలిసి తిరుగుచుండెను.

సులక్షణమహారాజు, అతని భార్యలు భోజనముచేసి మంత్ర ఫలమువద్దకు వచ్చిరి బంగారు పళ్ళెమునందుంచిన ఫలము కనిపించలేదు. రాజునకు మొక్కడలేని కోపమువచ్చి సింహగర్జన చేసినాడు. మా కేమియు తెలియదు" అని భార్యలు [illegible] చెప్పిరి.

ఎంతో కష్టపడి మహామునుల అనుగ్రహమువలన సంపాదించిన మంత్రఫలమును చేతులారా పోగొట్టుకొంటిని దిగులు చెంది బెంగతో మంచము పట్టినాడు. మంత్రఫలము తినిన చిన్నభార్య భర్తకడకువచ్చి "నాథా! నా ఆశకొలదీ ఆఫలము నేనే తినివేసినాను. క్షమింపు" మని వేడుకొనెను. అప్పటికి రాజు కొంత తృప్తి చెంది, వంశోద్ధారకుడు ఒక్కడైనా పుట్టగలడని ఊరకుండెను. గారాబముతో ఆమెను చూచెను.

కనిష్ఠ గర్భవతి అయినందున నవమాసములు నిండుచున్నందున మిగిలిన భార్యలు కన్నెఱ్ఱతో ఓర్వలేకపోయారు. ఆమె పుత్రవతి అయినచో తమను రాజు సరిగా చూడడని ఆలోచించి ఆమె గర్భము చెడులాగున, ఆమె తిను ఆహారములో ఔషధము కలిపి పెట్టినారు. నరపుత్రుడుగా పుట్టుచున్నాడు. గనుక గర్భములోని శిశువునకు ఏ అపాయమూ కలుగలేదు. కాని ఔషధముయొక్క తీవ్రతవలన ఆమెకు పిచ్చిఎత్తినది. ఆ పిచ్చివలన ఒకనాటి రాత్రి ఆమె అడవి లోనికి వెళ్ళిపోయినది. అప్పటికి నిండుచూలాలు అయివున్నందున ఆ యడవిలో బండరాతిమీద మగశిశువును ప్రసవించినది. ఆమె ప్రసవించినచోట ఒక పులి కాచుకొని వున్నందున, వెంటనే పురిటి వాసనను పసికట్టివచ్చి ఆమెను చంపితినెను.

పాపమాపసిబిడ్డ రక్తపు మరకలతో నుండి ఏడ్చుచుండెను. రాజహంసలు ఆహారముకొరకు తిరుగుచూ ఆ రాజబిడ్డను చూచి దగ్గరకు వచ్చి రెక్కలతో ఆ బాలుని తడియార్చి వాటి ముక్కులతో మెత్తటి గడ్డి తెచ్చి పరచి దానిపై పడుండబెట్టినవి. ఆ బాలునికి తేనె పండ్లు తినిపించి ఒక ఏడాదివరకు పెంచినవి. ఎండాకాలం వస్తున్నందున అక్కడ వాటికి నీరుదొరకదని ఆ బాలుని తీసుకొని కొంత దూరములోనున్న తమజాతి హంసలకు అప్పగించి వెళ్ళిపోయినవి.

ఆ హంసలు ఆ బాలునికి కావలసిన పండ్లు, తెనె గుజ్జు మొదలగునవి తెచ్చి పెంచుచుండగా ఒక తపస్వి తనయొద్ది భార్యలతో

వచ్చి ఆ కోనేటిలో స్నానముచేసి దుస్తులు మార్చుకొనుచుండగా హంసలతో తిరుగుచు తప్పటడుగులు వేస్తూ కొలనువద్దకువస్తున్న బాలునిచూచి ముక్కచెలిగి వారి వెంట తీసుకొనిపోయిరి.

రాజకుమారుడు వారి ఆశ్రయములో మూడు సంవత్సరములు గడిపెను. కొద్దికొద్దిగా మాటలు వచ్చుచున్నవి. వారిని చూచి నాకొడుకు అని పెద్దభార్యకు ఈర్ష్యజనించెను. పిల్లవాడు సాయంత్ర సమయమున ఆడుకొనుచుండగా వానిని ఎత్తుకొనిపోయి అడవిలో దిగబెట్టివచ్చెను. భర్తవచ్చి పిల్లవాడేని అడిగిననూ నిజపుసంగతి చెప్పలేదా దుర్మార్గురాలు.

## 26వ అధ్యాయము

### సుధర్ముడు తండ్రిని చేరుట

పాపమూ బాలుని జాతకము ఎటువంటిదోగాని తన తల్లి అడవిలో పులిచే చంపబడినది ఇప్పుడు పెంపుడుతల్లి అడవిలో విడిచి పెట్టి వెళ్ళిపోయినది. ఇకఆపిల్లవానిని దీనగతుకుడగు శ్రీహరియే రక్షించాలి. ఆరాత్రి బాలుడు ఏడ్చి ఏడ్చి అలసి నిద్రపోయాడు. అక్కడొక తులసిమొక్క వున్నది. నిద్రలో బాలుని చెయ్యి తులసిచెట్టుపై బడినందున ఆ రాత్రి అతనికే అపాయమూ కలుగలేదు. పైగా దైవభక్తి కలిగెను. ఉదయమే లేచునప్పటికి అడవిలో ఏకాంతముగా నున్నందున భయపడి బిగ్గరగా ఏడ్చినాడు ఆరోదనకు పక్షులు, జంతువులు, మృగములుకూడ రోదనచేసి ఆ బాలునికి రక్షణగా వుంచి ఆహారము తెచ్చి ఇచ్చుచుండెడివి. ఆ బాలుడు అడవిజంతువులచే పెంచబడుతూ దినదినాభివృద్ధి చెందుచూ ఏ తులసిచెట్టువద్ద పడివుండెనో, ఆ మొక్కకు ప్రతినిత్యము పూజలు చేయుచు కాలము గడుపుచుండెను.

అలా పెరుగుతూ పన్నెండేండ్లు ప్రాయంగలవాడయ్యెను. ప్రతి దినము తులసిపూజ భగవన్నామస్మరణచేస్తూ "నన్ను కాపాడుము తండ్రీ అనాథరక్షకా" అని ప్రార్థించుచు, ఒకొక్కప్పుడు విరక్తుడై "ఛీ ఎంత ప్రార్థించినా నాగతి ఇంతేనా? నేను బ్రతికెందుకు?" అని దుఃఖించుచుండగా, ... బాలచంద్రా ... వల్లుపిచారింప

కము ఈ సమీపముననే ఒక కోనేరు వున్నది. మాఘమాసము ప్రవేశించినది. అందుచే నీవా సరస్సులో స్నానము చేసినయెడల శ్రీమన్నారాయణుడు నీకు ప్రత్యక్షమగును'' అని పలికిన మాటలు ఆకాశమునుండి వినిపించినవి. వెంటనే ఆ రాజకుమారుడు సరోవరమునకు వెళ్ళి మాఘస్నాన స్నానం చేసి శ్రీహరిని స్తుతించెను.

ఈ బాలుని నిష్కళంకభక్తికి, నిర్మల హృదయానికి లక్ష్మీ నారాయణులు ప్రత్యక్షమై అతనిని దీవించి "బాలకా నీకేమి కావలయునో కోరుకొనుము" అని యనగా "ప్రభూ! నాకు తండ్రి ఎవరో తల్లి ఎవరో తెలియదు. నాకు ఆలనాపాలనా చేయువారైనను లేరు. పుట్టినది మొదలు కష్టములేతప్ప సుఖమన్నది ఎరుగను. ఈవనచరములే నన్ను రక్షించి పోషించుచున్నవి. గాన మీ సన్నిధానమునకు నన్ను తీసుకొనిపొండు. మరేమియు అక్కరలేదు." అని ప్రార్థించెను.

"ఓ ఘీ రాజనందనా! నీవు ఇంకను భూలోకమునందు ధర్మముగా పరిపాలన చేయవలసిన యవసరమున్నది. నీ తండ్రియగు సులక్షణుడు వృద్ధుడై నీగురించి, నీకన్నతల్లిని గురించి బెంగతో వున్నాడు. గాన నీవు నీ తండ్రివద్దకు పోయిరమ్ము'' అని చెప్పి ఆకోలను సమీపమున తపస్సు చేసుకొనుచున్న ఒక మునీశ్వరుని తోడుయిచ్చి సులక్షణుని వద్దకు పంపెను.

అప్పటికే సులక్షణుడు తన కడసారి భార్య గర్భవతిగా వుండి ఎటుపోయెనో, పుట్టిన బిడ్డ ఏమాయెనో, యని తన రాజ్యమంతయు వెదకించి తానును వెదకి వారిజాడ తెలియనందున విచారమనస్కుడై రాచకార్యములు చూడకుండెను. అటువంటి సమయములో ముని వెంట కుమారుడు వెళ్ళెను. రాజుతోముని యా బాలుని జన్మవృత్తాంతము తెలియజేయుసరికి సులక్షణ మహారాజు అమితానందభరితుడై బాలుని కౌగలించుకొని మునీశ్వరునికి మర్యాదలుచేసి కుమారునికి సుధన్ముడని పేరుపెట్టి పట్టాభిషేకము చేసెను.

# 27 వ అధ్యాయం వరిం

## ఋక్షక యను బ్రాహ్మణకన్య వృత్తాంతము.

పూర్వము భృగుమహాముని వంశమందు ఋక్షక యను కన్య జన్మించి దినదినాభివృద్ధి పొందుచుండెను. ఆమె దురదృష్టవంతురాలు కాబోలు. పెండ్లి అయినవెంటనే పెండ్లికుమారుడు చనిపోయెను.

ఋక్షక తన దురదృష్టమునకు దుఃఖించి విరక్తి భావముతో యిల్లు విడిచి గంగానదీతీరమునకు పోయి ఆశ్రమము నిర్మించుకొని శ్రీమన్నారాయణుని గూర్చి తపస్సు ప్రారంభించెను.

ఆ విధముగా చాల సంవత్సరములు ఆచరించుటవలన ననేక మాఘమాస స్నానఫలములు దక్కెను. ఆమె మనోవాంఛ ఈడేరు సమయము దగ్గరపడినది. ఒకనాడామె తపస్సుచేసుకొనుచూ ప్రాణములు విడిచెను. ఆరోజు వైకుంఠ ఏకాదశి అగుటవలన వైకుంఠమునకు వెడలెను. ఆమె చాలా సంవత్సరములు వైకుంఠమందే యుండి తరువాత బ్రహ్మలోకమునకు పోయెను. ఆమె మాఘమాస వ్రతఫలము కలిగి పవిత్రురాలగుటచే బ్రహ్మదేవుడామెను సత్యలోకములో దేవకార్యములు తీర్చుటకు అప్సరస్త్రీగా జేసి "తిలోత్తమ" యను పేరుతో సత్యలోకమునకు పంపెను.

ఆ కాలంలో సుందోపసుందులనే యిద్దరు రాక్షస సోదరులు బ్రహ్మనుగూర్చి ఘోరతపస్సు చేసిరి. వారి తపస్సుయొక్క ప్రభావమునకు బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై "మీకేమి కావలయునో కోరుకొనుడు" అని యనగా "స్వామీ! మాకు యితరులవలన మరణము కలుగకుండ వుండునట్లు వరమిమ్ము" అని వేడుకొనగా బ్రహ్మ అటులనే యిచ్చితి"నని చెప్పి అంతర్ధానమయ్యెను.

బ్రహ్మదేవునివలన వరము పొందిన నా యిద్దరు రాక్షసులు మహాగర్వముగలవారై దేవతలను హింసించి, మహర్షుల తపస్సులకు

భంగం కలిగించుచుండిరి. యజ్ఞయాగాది క్రతువులలో మాంసం రక్తం పడవేసి, ప్రజలను నానాభీభత్సములు చేయుచుండిరి. దేవలోకముపై దండెత్తి దేవతలందరినీ తరిమివేసిరి.

ఇంద్రుడు మొదలగు దేవతలందరూ సత్యలోకమునకు వెళ్ళి బ్రహ్మను వేడుకొని "మహానుభావా! సుందోపసుందులనే రాక్షసులకు మీరిచ్చిన వరములతో గర్వం గలవారై తపశ్శాలురను బాధించుచు, దేవలోకమునకు వచ్చి మమ్మందరను తరిమి చెరసాలలో బెట్టి, నానాబీభత్సం చేయుచున్నారు. గాన వారి మరణమునకేదైనా యుపాయమాలోచించు" మని దేవేంద్రుడు ప్రార్థించెను. బ్రహ్మ దీర్ఘంగా గాలోచించి, తిలోత్తమను పిలిచి "అమ్మాయీ! సుందోపసుందులను రాక్షసులను ఎవరివలనను మరణము కలుగదని వరం ఇచ్చియున్నాను. వరగర్వంలో చాల అల్లకల్లోలం చేయుచున్నారు. గాన నీవు పోయి నీచాకచక్యముతో వారికి మరణము కలుగునటుల ప్రయత్నించుము" అని చెప్పెను.

తిలోత్తమ బ్రహ్మదేవునకు నమస్కరించి సుందోపసుందులున్న యరణ్యమును ప్రవేశించెను. ఆమె చేత వీణపట్టుకొని మధురమైన పాటలు పాడుకొనుచు నా రాక్షస సోదరులున్న నివాసమునకు సమీపములో తిరుగుచుండెను. వీణానాదమును ఆమె మధురగానమును విని సుందోపసుందులు తిలోత్తమను సమీపించిరి. ఆమె ఎటుపోయిన నటు, యెటు తిరిగిన నటులామెను అనుసరిస్తూ ప్రేతకులవలె వెంటాడుచుండిరి. ఆమెను "నన్ను వరింపుము. నన్ను వరింపుము" యని తిలోత్తమను యెవరికి వారు బ్రతిమలాడసాగిరి.

ఓ రాక్షసాగ్రేశ్వగులారా! మిమ్ములను పెండ్లియాడుట నాకు యిష్టమే మీరిద్దరూ నాకు సమానులే. నేను మీ యిద్దరి యెడల ప్రేమతో నున్నాను. ఇద్దరిని వివాహ మాడుట సాధ్యం కానిది, గాన నా కోరిక యొకటున్నది. అది ఏమనగా మీ ఇద్దరిలో ఎవరు బలవంతులో వారిని నేను ప్రేమించగలను" అని తిలోత్తమ చెప్పెను.

ఆమె మాటలకు సుందోపసుందులకు పౌరుషములు వచ్చినవి. మీసములు మెలిబెట్టి 'నేను బలవంతుడను' 'నేను బలవంతుడను' అని ఇద్దరును తొడలుగొట్టుకొనిరి, భుజములు చరిచిరి. మాటలు చేతలవరకు వచ్చి ఒకరినొకరు త్రోసుకొనిరి గ్రుద్దుకొనిరి, మల్లయుద్ధము చేసిరి. ఇక ఆయుధములు పట్టుదశవచ్చి గదలు పట్టిరి. ముద్గరాలు ఎత్తిరి. దెబ్బకు దెబ్బ కొట్టుకొనుచుండిరి. వారి పోరాటము రెండు పర్వతాలు డీకొన్నట్లుగా వున్నది. మేఘాలు ఉరిమినట్లుగా ఉరిమి భయంకరముగా యుద్ధముచేసిరి. గదాయుద్ధముమాని కత్తులు దూసిరి. ఆ కత్తియుద్ధములో ఒకరి ఖడ్గము మరొకరికి తగిలినందున ఇద్దరి తలలూ తెగిక్రింద పడినవి. ఇద్దరూ చనిపోయిరి.

తిలోత్తమను దేవతలందరు దీవించిరి ఆమె బ్రహ్మకడకుపోయి జరిగినదందా తెలియపర్చగా బ్రహ్మసంతోషించి, త్రిలోత్తమా! నీవు మంచి కార్యముచేసితివి. నీవలన సుందోపసుందులు మరణించిరి నీకీ బలము వచ్చుటకు కారణము నీవు చేసియున్న మాఘమాస వ్రతపలమే గాన నీవు దేవలోకానికి వెళ్ళు దేవతలు నిన్ను గౌరవిస్తారు. అచ్చట అప్సరసలందరికంటె నీవే అధికురాలవగుదువు అని దీవించి పంపెను.

# 28వ అధ్యాయము

## బ్రహ్మ, ఈశ్వరుడు, శ్రీమహావిష్ణువును పూజించుట

వశిష్ఠుడు దిలీపునితో మరల ఇట్లు వివరించెను. రాజా! ఒకప్పుడు బ్రహ్మ, ఈశ్వరుడు వాదములాడుచుండిరి ఆ వాద మెట్టిదనిన

ఒకనాడు బ్రహ్మదేవుడును పరమేశ్వరుడును 'నేను అధికుడను' అని ఒకరు-కాదు 'నేనే సర్వాధికుడను' అని మరి ఒకరు తగవులాడు కొనిరి. పద్నాలుగు లోకాలకు అధిపతిని నేను అని సాంబశివుడనగా 'ఓ మహేశా! నీవు అధిపతి వెట్లగుదువు? ఆ పద్నాలుగు లోకాల జీవరాసులను పుట్టించిన సృష్టికర్తను నేను, గనుక నీ కంటె నేనే గొప్పవాడను' అని బ్రహ్మ వాదించెను, వాద ప్రతి వాదములు

పెద్దవయ్యెను. అటుల వెయ్యేండ్లవరకు కొనసాగించినందున సృష్టికార్య క్రమములు స్తంభించిపోవుచున్నవని. విష్ణువు విశ్వరూపముతో ప్రత్యక్షమయ్యెను.

బ్రహ్మ, ఈశ్వరుడు ఆ విరాటరూపమును తిలకించినారు. అందు సమస్తలోకములు ఇమిడియున్నవి. సప్తసముద్రాలు ఘర్జించుచున్నవి. ఆ విశ్వరూపుని చెవులలో ఒకవైపు బ్రహ్మ, మరొకవైపు ఈశ్వరుడు కనబడిరి. ఇది అంతయు బ్రహ్మ, మహేశ్వరులు చూచి గంధ పుష్ప అక్షతలతో పూజించిరి. ఆ విశ్వరూపుని ఆ విశ్వవ్యాప్తుని, ఆ విరాట స్వరూపుని ఆద్యంతములను ఎవరు తెలిసికొనివచ్చెదరో వారే అధికులని నిశ్చయించి బయలుదేరినారు. అట్లు వారు వెయ్యేండ్లు తిరిగి నారేగాని ఆ విరాట్ స్వరూపుని ఆద్యంతములు తెలుసుకొనలేక విసిగిపోయి మరల యథాస్థానమునకు వచ్చి ఇట్లు వాపోయినారు,

వెయ్యేండ్లు రాత్రింబవళ్ళు తిరిగి తిరిగి అలసిపోయినామే గాని ఈ విరాటరూపుని ఆద్యంతములు తెలుసుకొనలేకపోయాము. గానమన మెవరమూ అధికులముకాము. ఈ సృష్టికంతకు మూలకారకుడు మహావిష్ణువే. ఇతడే సృష్టికర్త, ఇతడే లయకారుడు. ఇతడే సర్వాంతర్యామి. తన కుక్షియందిడుకొని కాపాడు కళ్యాణధాముడు ఇతడే సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు, యముడు సర్వలోకాలకు ఏకైకనాథుడు అట్టి మహానుభావుడగు నారాయణుడే అధికుడుగాని మనమెవ్వరమూ అధికులము కాజాలము. అని నిశ్చయించుకొని విష్ణుమూర్తిని స్తోత్రం చేయగా తన విరాటస్వరూపాన్ని వదలి యథారూపముతో – ఓ అన్నలారా, మీరిద్దరునూ ఎంతో కాలమునుండి కలహించుచున్న విషయము గురించి మీకు జ్ఞానోదయము కలుగుటకు నేనీ విశ్వరూపమును మీకు చూపదలచి ఇట్లు చేసితిని. నాయొక్క రూపమునకు అది అంతమును కనుగొనలేక నిశ్చేష్టులయి మీ కలహాన్ని ఆపుచేసితిరి. సమస్త భూమండలానికి, సమస్త ప్రాణికోటికి సమస్త దేవతలకు

సృష్టికర్తను నేనేయని గ్రహించి స్తుతించిరి. మీరెందులకు కలహించు కొంటిరో చెప్పెదను వినుడు.

మీరిరువురు రజోగుణతమోగుణములకు కట్టుబడి యుండుటచే మీకీ అహంభావం కలిగినది. సత్త్వము, రజము, తమము అను మూడు గుణములు కలవు. ఈమూడు గుణాలుగలవాడే గొప్పవాడు. అతడు తేజోవంతుడగును. ఈ సృష్టికి పూర్వం ఈవిశ్వమంతా చీకటిగా వుండేది. పంచభూతాలు సృష్టింపబడలేదు. అప్పుడు నేను సృష్టి చేయుటకు ఉపక్రమించినాను. ఒక బంగారుగోళమును చేసి దానికి అవయవస్ఫుటం కలిగించిమూడు రూపములుగా చేసితిని. ఆ మూడు రూపములే మీరు నేనున్నూ, మనముగ్గురం సృష్టి స్థితిలయములకు ముఖ్య కారకులమైనాము. సృష్టిని చేయువాడు బ్రహ్మగాను, పోషించువాడుగా నేను నాశనం చేయువాడ శివుడుగాను. ఏర్పడితిమి. గనుక మనం త్రిమూర్తులము. నేనే మీరు మీరే నేను నాకు పూజలు చేసిన మీకు చెందును, మీకు పూజలు చేసిన నేను పొందుదును. గనుక మీరిరువురకునూ భేదమేలేదు. మొదట లేని భేదము ఇప్పుడెందులకు కలిగినది? మీకున్న రజోగుణ, తమోగుణ ప్రభావముల వలలనే అహంకార పూరితులై ఇట్లు ప్రవర్తించినారు గాన శాంతింపుడు.

బ్రహ్మదేవా! సమస్తప్రాణులను సృష్టించుచున్న సృష్టికర్తవు నీవు. వేదమునకు స్థానభూతుడవు నీవు. స్వశక్తి చేత యోగమునుపొంది నా నాభికమలమునందు జన్మించినావు. గనుక నీకును నాకు భేదము లేదు. అని శ్రీమహావిష్ణువు బ్రహ్మను వారించెను.

తరువాత శివునివైపు తిరిగి "ఓ సాంబశివా! నీవు సమస్తలోకములకు ఆధార కర్తవు. దేవతలచే సదా పూజింపబడువాడవు. పరమానంద స్వరూపుడవు. శరణాగతరక్షకుడవు. బ్రహ్మజ్ఞానివి. ప్రళయకాల రుద్రుడవు. ఓంకార స్వరూపుడవు. పరమేశ్వరుడవు. నీ ఘనతను తెలుసుకొనగోరి [illegible] మహాత్మ్య

మును వివరింపమని కోరగా నాతనికి నీచరిత్రమును తెలిపితిని. అప్పటి నుండి నారదుడు నిన్ను అనేక విధములుగా స్తోత్రము చేయుచున్నాడు. నారదునివలన సమస్తలోకాలకు నీ మహిమ వెల్లడయినది.

నీవు పరబ్రహ్మవు. ఈ ప్రపంచమంతయు నీరూపమే నావలెనే నీవును అంతటా వ్యాపించియున్నావు. నీకును నాకును భేదమే లేదు. కోటిసూర్యప్రకాశితుడవు. మేరుపర్వతనివాసుడవు సర్వప్రపంచాన్ని నీకాద్రరూపంచే నాశనము చేయగలవాడవు, నీ కోపాగ్నికి ముల్లోకములు గడగడ వణికిపోవును. నీవు శక్తిస్వరూపుడవు, అనంతుడవు ఆది దేవుడవు, ఆత్మస్వరూపుడవు, భక్తులు నిన్ను 'శివశివా' యని ప్రార్థించినంత మాత్రమున వారి కష్టములు పోగొట్టువాడవు. అట్టినీవు ఇంత పంతము పూనుట న్యాయమా? నేనే నీవు నీవే నేను అందువలననే శివ కేశవులని మనలను భక్తులు పూజించుచున్నారు. నీవు నిర్వికల్ప నిరాడంబరుడవు, త్రినేత్రుడవు, సదా ధ్యాన స్వరూపుడవు, భక్తులు నిన్ను ధ్యానింతురు భక్తులకు నీవుధానముచేయుదువు, పార్వతీదేవిని నీ అర్ధశరీరములో నిల్పుకొన్నవాడవు, నందివాహనారూఢుడవు పరాత్పరుడవు గాన నీవును నాతో సమానుడవే అని ఈశ్వరునికి విష్ణుమూర్తి హితబోధ చేసెను.

ఈ విధంగా బ్రహ్మకు ఈశ్వరునికి వారి వాదనల సారాంశమును తెలియ పరచి, ఇద్దరికి సఖ్యత కుదిర్చెను. అంత బ్రహ్మయు మహేశ్వరుడును జగదాధారుడయిన శ్రీమహావిష్ణువును స్తోత్రము చేయగా శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవి సహితముగా ప్రసన్నుడయి బ్రహ్మ సరస్వతులను శంకర పార్వతులను ఆశీర్వదించి అంతర్ధానమయ్యెను.

# 29వ అధ్యాయము

## మాఘ ఏకాదశీ మహాత్మ్యము (క్షీరసాగర మథనము)

ఓ దిలీపుడా! అశ్వమేధయాగము చేసినవాడును, మాఘమాసములో స్నానము చేయువాడును, అటులనే ఏకాదశీవ్రతము చేసి

ఉపవాసముండువాడును వైకుంఠ ప్రాప్తుడగును, ఇందుల కెట్టి సంది యమూ లేదు. ఏకాదశీ వ్రతమహిమవలన అంబరీషుడు దూర్వాసుని వలన ఎట్టి అటంకమును పొందక తిరిగి దూర్వాసునే ఆశక్తి నె.బ డించి అతని గర్వమణచినది. ఈ వృత్తాంతము నీకు తెలిసియేయున్నది. అయినను నీవు అడిగితివిగాన మరియొక దృష్టాంతరం నీకు వివరించెదను.

ఒకనాడు దేవతలును, రాక్షసులును అమృతము కొరకు పాల సముద్రము మధించినారు. మేరుపర్వతాన్ని తీసుకువచ్చి కవ్వము గాను, వాసుకియను పామును కవ్వపుత్రాడుగాను చేసిరి. ఆ పామును మేరుపర్వతానికి చుట్టబెట్టినారు. పాముతలవైపు ఎవరుందురా? యని సందేహమురాగా, మేముందుమని రాక్షసులు వాసుకి తలవైపు పట్టుకొనిరి. దేవతలు తోకవైపువుండిరి. ఈ విధముగా దేవదానవులు పాలసముద్రాన్ని మధించగా మొదట లక్ష్మీదేవి జన్మించెను. విష్ణు మూర్తి శ్రీమహాలక్ష్మిని తీసుకొని తన భార్యగా స్వీకరించెను. తరువాత ఉచ్చైశ్రవమను గుఱ్ఱము, కామధేనువు, కల్పవృక్షము, అమృతభాండము జన్మించెను. అన్నియు భద్రపరచి వుంచమని దేవేంద్రునికి విష్ణుమూర్తి వప్పగించెను.

మరల పాలసముద్రాన్ని చిలికినారు. అందులోనుండి అగ్నితో సమానమైన గొప్ప తేజస్సుతో కూడిన హాలాహలము బైటకు వచ్చి నది అది మహావిషము. ఆ విషజ్వాల అన్నిలోకాలకు వ్యాపించినది. ఆ వేడికి సర్వము నాశనమగుచున్నది ఆ మహావిషాన్ని చూచి దేవ తలు, రాక్షసులుకూడ భయపడసాగిరి. మరికొంతసేపున్న యెడల వారందరిని హతమార్చివేయగలదు. వారికి మరోమార్గము లేక ఈశ్వ రుని "హరహర మహాదేవా! వృషభధ్వజా! శరణు, మమ్ము యీ ఆపదనుండి రక్షింపుము" అని స్తుతించిరి.

శంకరుడు దేవతలయొక్క రాక్షసులయొక్క ఆర్తనాదమును విన్నాడు ఇక ఒక్కక్షణమైనను జాగుచేయకూడదని గ్రహించి తన

నోరు తెరచి, ఆ కాలకూట విషాన్ని మ్రింగి కంఠమునందుంచు కున్నాడు. ఆ కాలకూట విషమువల్ల శంకరుని కంఠము నల్లబడిపోయి నది. అందుచేతనే నీలకంఠుడనే పేరు సార్థకమయ్యెను.

పాలసముద్రాన్ని మధించుట ఆపుజేసిరి. అమృతం మాకు కావలయునని దేవతలు, మాకు కావలయునని రాక్షసులు, వాదన చేసిరి.

మాయామానుష వేషధారుడగు శ్రీహరి ఈ వాదములను గ్రహించినాడు. ఆయిన స్త్రీ రూపము ధరించెను ఆమెయే మోహిని, ఆమె అందచందాలు జూచిన ఏ స్త్రీకూడా సరితూగదు.

అమృతముకొఱకు జగడమాడుకొనుచున్న దేవదానవుల మధ్యకు జగన్మోహిని వచ్చి 'ఓ అమాయకులారా! ఎందులకీ రాద్ధాంతం? మీకందరికీ నేను సమానముగా అమృతాన్ని పంచిపెట్టుదును. కనుక దేవతలందరూ ఒక వరుసలోను, దానవులందరూ ఒక వరుసలోను ఆసీనులు కండు అని చెప్పి ఆ మోహిని రూపమును చూడగానే మారు మాటలాడలేక అటులే చేయమనికోరి, రెండు పంక్తులుగా కూర్చుండిరి. జగన్మోహిని అమృతభాండాన్ని రెండుగాజేసి ఒకదానిలో సురాపానం. వేరొక దానితో అమృతాన్ని వేసి నాట్యము చేయుచున్నట్లు వయ్యారి నడకలతో చిరునవ్వునవ్వుచూ వారలను ముగ్ధులను జేసి అమృతాన్ని దేవతలకు, కల్లును రాక్షసులకు గుర్తుతెలియకుండా వడ్డించు చుండగా, ఈ మాయ కనిపెట్టి ఇద్దరు రాక్షసులు- రాహువు, కేతువు అనువారు రాక్షస పంక్తినుండి దేవతలలోనికి మారురూపమున వచ్చి కూర్చొని జగన్మోహిని పంచుచున్న అమృతాన్ని గ్రోలిరి.

జగన్మోహిని అది కనిపెట్టి చక్రాయుధముతో వారి శిరస్సులు త్రెంచెను. వారు త్రాగిన అమృతము కంఠము నుండి దిగనందున వారు చనిపోయిరి. ఆ యమృతమును దేవతలు జుర్రుకొనిరి. యీ మోసమునకు రాక్షసులు హాహాకారాలు చేసిరి. ఇద్దరు రాక్షసుల

మాయచేత పంక్తిలోకివచ్చి అమృతము సేవించెనని, దేవతలు గోల చేసిరి. కడకు రాక్షసులంతా ఏకమై "ఈ అమృతం మాకక్కరలేదు. మేమెవరికీ భయపడము. మాకు చావులేదు" అని ఎవరిమట్టుకు వారు వెళ్ళిపోయిరి. మిగిలిన అమృతమును విష్ణుమూర్తి, బ్రహ్మ, శివుడు ముగ్గురు కలసి దేవేంద్రునికిచ్చి వారి నివాసములకు వెళ్ళిపోయిరి.

పాలసముద్రము మథించగా వచ్చిన అమృతకలశము నొకచోట వుంచు సహాయమున విధివశమున రెండు చుక్కలు భూమిమీద పడినవి. ఆ రెండుచుక్కలు పడినచోట రెండు అందమైన మొక్కలు బయలుదేరినవి. ఆ రెండు మొక్కలలో ఒకటి పారిజాత మొక్కగను రెండవది తులసి మొక్కగను భూమియందు పెరిగినవి. అటుల పెరుగుచున్న మొక్కలకు సత్రాజిత్తుఅనువాడు ప్రతినిత్యము నీరుపోసి పెంచుచుండెను.

కొంత కాలమునకు పారిజాతవృక్షము పుష్పించెను. దేవేంద్రుడు గగన మార్గమున బోవుచు పారిజాత పుష్పసువాసనకు దిగివచ్చి వనుకోసి తన భార్యయగు శచీదేవి కిచ్చెను. మిగిలిన దేవతా స్త్రీలుకూడా అడిగిరి. మరల ఇంద్రుడు రహస్యముగ ఆ తోటలో ప్రవేశించెను. పారిజాత పూవులు ఎవరో కోయుచున్నారని సత్రాజిత్తు విష్ణుపాదాలవద్దనున్న అక్షతలు పువ్వులపైన ఆ వనమంతా చల్లియున్నందున, దేవేంద్రుడు పారిజాతపుష్పమును తెంచుచుండగావిష్ణు మహిమవలన అతనికి దేవత్వముపోయి మూర్ఛపోయాడు. దేవతలు ఈ వార్తవిని నారదుని బ్రతిమలాడి వారందరూ కృష్ణునికడకు వెళ్ళి జరిగిన సంగతులు విన్నవించగా కృష్ణుడు సత్రాజిత్తుకడకు బయలుదేరెను.

సత్రాజిత్తు ఆషాఢశుద్ధ ఏకాదశినాడు ఉపవాసముండి ఆ రాత్రి జాగరణచేసి, ద్వాదశినాడు సద్బ్రాహ్మణులకు దానములు యిచ్చి వున్నందున అతడు అమోఘమైన శక్తి కలిగి యున్నందున కృష్ణభగవానుడు వరమిచ్చి అతని తోటలో ఉన్న పారిజాత వృక్షమును

దేవేంద్రుని కిప్పించెను. ఈవిధముగనే తులసీవనమునకు వెళ్ళి తులసిని తన సన్నిధిలో వుండమని చెప్పగా తులసీదేవి అటులనే అని అప్పటి నుండి విష్ణుదేవునితో సమానముగా పూజింపబడెను.

యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతా
యదగ్రే సర్వవేదాస్య తులసి తాం నమామ్యహమ్ ॥

అని తులసీదేవిని శుచియై పూజించినయెడల సకల సౌభాగ్యములు చేకూరును.

# 30 వ అధ్యాయము

## - ఫలశ్రుతి -

సూతమహర్షి శౌనకాదిమునులతో ఇట్లు పలికిరి - "సనకాది మునులారా! ఇంతవరకు మాఘమాసమహాత్మ్యము, మాఘస్నానము వలన కలిగెడు ఫలమును, వశిష్ఠులవారు దిలీపునకు తెలియచేసిన విధమును మీకు వివరించితిని. మీరు తలపెట్టిన ఈ పండ్రెండు సంవత్సరముల మహాయజ్ఞముకూడా పూర్తి కావస్తున్నది. రేపటిదినము మాఘమాసపు ఆఖరి దినము గాన మనమందరము గంగానదికి పోయి స్నానమాచరించి విష్ణువుని పూజింతుము రండి అని సూతమహాముని మాఘపురాణం చెప్పుట పూర్తిగావించిరి.

మాఘమాసములో సూర్యుడు మకరరాశియందు వుండగా సూర్యోదయం అయిన తరువాత నదిలో స్నానము చేయవలయును. ఆటుతర్వాత సూర్యునకు నమస్కరించి విష్ణ్వాలయమ్మునకు పోయి శ్రీమన్నారాయణుని పూజింపవలయును. మాఘమాసముయొక్క నెల దినములున్నూ ఈ విధముగా ఆచరించిన యెడల సకలైశ్వర్యములు, పుత్రపౌత్రాభివృద్ధి కలిగి జన్మాంతమున వైకుంఠప్రాప్తి కలుగును.

సంపూర్ణము

... రాజమండ్రి-1. ఫోన్ నెం. 5120

